# యతి సంప్రదాయము



'సాధన రహస్య', 'సర్వ సిద్ధాంత సారబా'ది

బహు గ్రంథకర్తలు

శ్రీ రామకృష్ణాశ్రమముల (బాపట్ల & భీమునిపట్నము)

సంస్థాపకులు

పరమహంస - పరివ్రాజకాచార్య

## శ్రీశ్రీశ్రీ అనుభవానంద స్వాములవారు



'పరమహంస' కార్యాలయము

భీమునిపట్నము - 531 163 (విశాఖజిల్లా)

చతుర్థ పుష్పము
సర్వహక్కులు : ప్రకాశకులవి
ప్రథమ ముద్రణ : 1985

వెల : రు. **2-50**

ప్రతులకు :
*'పరమహంస' కార్యాలయము
భీమునిపట్నము - 531 161 (విశాఖజిల్లా)
*శ్రీ అనుభవానంద గ్రంథమాల
బాపట్ల - 522 101 (గుంటూరుజిల్లా)

ముద్రణ :
శ్రీ శారదా ప్రింటర్స్,
జి. బి. సి. రోడ్, బాపట్ల



# అంకితము

శ్రుతి సంప్రదాయమునకు
ఒక మహోత్కృష్ట సందేశము నిడి,
మన ప్రాచీనాధ్యాత్మిక దుందుభిని
దేశ దేశములఁ బూని మ్రోగించి,
భారతీయ సంస్కృతి విశిష్టతను
ఎల్లర హృదయములకు అందించిన
యతి సార్వభౌముడు
'శ్రీ వివేకానందస్వామి'కి

# 'యతి సంప్రదాయ' సందేశము

Sanyasi is a world teacher సన్న్యాసి జగద్గురువు అని శ్రీరామకృష్ణ దేవుని వచనము. 'ఎత్తి పాడుము కంఠము నెత్తి పాడు! యతివరా! ధీర! ఓం తత్సదనుచు పాడు!' సన్న్యాసిని యతివరా! ధీరా! అని వివేకానంద స్వామి సంబోధనము. ఇదేవిధమున 'లోకదృష్టి ఎట్లున్న లెక్క ఏమి? ధీరులకు సొమ్ము సన్న్యాసమార్గమనగ' అని శ్రీ అనుభవానందస్వామి ★'సన్న్యాస మార్గము'న వ్రాసియుండిరి. పై వాక్యముల ప్రకారము, లోకమున గల దుష్ట సంస్కారముల పోరాటమున ధీరుడై, లోక విషయములు తన పైకి దండెత్తినను చలించని ధీరుడై, కాషాయ వస్త్రధారణముచే జగద్గురువుకాక, బ్రహ్మానందానుభూతితో, సాధకులలో సిద్ధుడై, మానవులలో మహాత్ముడై, శిష్యులకు

---

★ 'సన్న్యాసమార్గము' గూర్చి 'సాధన సుధ' గ్రంథమున వివరించియున్నాము.

కావలసిన ఆధ్యాత్మిక రహస్యముల తెలియపరచి, వారి దుష్ట సంస్కారముల రూపుమాపి, సత్సంస్కారముల పోషించి, వారిని ఉన్నతాధ్యాత్మిక శిఖరారోహణము చేయించుటలో జగద్గురువు కాగల శక్తిసంపన్నుడే సన్న్యాసి అను అర్థము స్ఫురించుచున్నది.

అనాదికాలమునుండి, యుగయుగములనుండి యీ సన్న్యాస సంప్రదాయము ప్రారంభమై, అంతర్గతమగు త్యాగవైరాగ్యము విడనాడక, దేశకాలానుగుణ్యముగ ఆచార వ్యవహారములలో వివిధ మార్పుల పొందియున్నది. ఆ మార్పులు, ఆయాదేశముల, ఆ యా కాలముల జన్మించి, తురీయాశ్రమ స్వీకరణము గావించివారివలన ఏర్పడినవని చెప్పకతప్పదు. అదేవిధముగా అభివృద్ధికూడా గోచరము.

ఈ సన్న్యాస సంప్రదాయము ఒక ప్రవాహరూపమై, ఒక్కొక్క యతివర్యుని చేరి, కొన్ని కొన్ని సల్లక్షణముల

కలుపుకొనుచు పోవుచున్నదేమో! ప్రథమమున యీ ప్రవాహము మనకు తెలియబడని అనేక సన్న్యాసులను కలుపుకొనుచు శ్రీ బుద్ధ భగవానుని సమీపించినది. అపర అహింసావతారమైన ఆ దివ్యమూర్తి యీ సన్న్యాసమును అందరికీ అందించుచు వచ్చెను. మరల ఆ ప్రవంతి శ్రీ శంకరాచార్యులను చేరనది. అపర శంకరుడై మేధాశక్తి సంపన్నుడైన ఆ బాల సన్న్యాసి యీ సన్న్యాసమును యింకను దృఢపరచి, యోగ్యులైనవారికిమాత్రమే అందించుచు వచ్చెను. అంత ఆ ప్రవాహము బయలుదేరి శ్రీ రామానుజాచార్యులను చేరనది, అపర భక్తితత్పరుడైన ఆయన కూడా యత్యాశ్రమ స్వీకారము జేసి, దానిని భక్తితో మేళవించి ప్రచారము చేసెను. మరల నా ప్రవాహము రామకృష్ణ పరమహంస దేవుని ఆశ్రయించినది, శివవిష్ణుసమైక్య జన్ముడైన శ్రీ రామకృష్ణుడు దురీయాశ్రమమును స్వీకరించి, శ్రీ బుద్ధ భగవానుని ప్రేమను, శ్రీ శంకరుని విజ్ఞాన

మును, శ్రీ రామానుజుని ఉపాసనమును గ్రహించి, తాను శాక్తేయుడై, సర్వ సమన్వయమును జాటుచు, మత సమ న్వయమునుగూడ తెలియపఱచి, సన్న్యాసమునకు బాహ్య విద్యగాని, అత్యంత మేధాశక్తిగాని కాక సుసంస్కారము లనియు, ఆ సత్సంస్కార వికాసమే సన్న్యాసమునకు యథార్థ యోగ్యత అనియు, అందు స్త్రీ పురుష తారతమ్యము లేదనియు, అనుభవపూర్వకముగ సన్న్యాసమునకు ఒక నూతన నిర్వచనమును గావించెను. అంత నా మహాప్రవా హము మరల పరిణమించి శ్రీ వివేకానందస్వామిని అందు కొనెను. శివాంశ సంభూతుడై, శ్రీరామకృష్ణుని దివ్య చరణకమలములు నాశ్రయించి, అనుభవముల గడించి, సన్న్యాస గ్రహణముచేసి, బుద్ధ, శంకర, రామానుజ, రామ కృష్ణుల గల ప్రేమ, విజ్ఞాన సంపద, భక్తి, సర్వ సమ న్వయముల గ్రహించి, యీ సంప్రదాయమును యితర ఖండములకుగూడ గొనిపోయి జ్ఞానతీర్థమును సర్వులకు

ప్రసారించి విశాలమును గావించెను. అనాదికాలమునుండి ప్రవహించుచుండిన యీ సన్న్యాస సంప్రదాయము శ్రీ రామ కృష్ణ వివేకానందుల ద్వారా శ్రీ అనుభవానంద స్వామిని చేరినది. శ్రీ స్వామివారు యథార్థముగ శ్రీరామకృష్ణ దేవుని అనుయాయులు. ఆ దివ్య సన్న్యాస సంప్రదాయ మును చక్కగా గ్రహించి, సన్న్యాస జీవితమును కాంక్షిం చువారికి కావలసిన యోగ్యతలను తెలియపరచుచు, సాధకు లకు వలయు సాధనా విధానముల సూచించుచు, సద్గురువు యొక్క లక్షణముల వివరించుచు, సాధన లేనిదే సిద్ధ త్వము లేదను పరమ రహస్యమును విశదీకరించుచు 'సాధన రహస్యము', 'సాధన సుధ', 'సాధన మకరం దము' అను గ్రంథ త్రయమును సాధకులకు ప్రసాదించి యుండిరి. అట్టి యోగ్యత గలవారు సాధన చేసికొనుటకు పవిత్ర, ప్రశాంత, వాతావరణములుగల శ్రీ రామకృష్ణా శ్రమ ద్వయమునుకూడ స్థాపించియుండిరి. పవిత్ర వాతా

వరణమున స్థిరచిత్తుడై, సాధన చేసికొని, అనుభవములు పొందినవాడు ఎట్లుండునో తెలియజేయుచు, వారు పొందిన అనుభవానందమును 'అనుభవానందము' అను గ్రంథ రూపమున అనుభవముతో వ్రాసియుండిరి. ఆ అనుభవానందానుభూతిని పొందినవారికే శ్రీ రామకృష్ణదేవుని సర్వమత సమన్వయమురీతి 'సర్వ సిద్ధాంత సౌరభము' ను ఆఘ్రాణించు శక్తి కలుగును అని 'సర్వ సిద్ధాంత సౌరభము' అను గ్రంథరాజమును ప్రసాదించియుండిరి. ఈ విధముగ తమను మలుచుకొనిన వారే ఆర్ష సంప్రదాయమునకు శిరోభూషణమువంటివారని ఆ సంప్రదాయము అనాదికాల సంబంధితమని యీ 'యతి సంప్రదాయము' అను యీ గ్రంథముద్వారా ప్రబోధించియుండిరి. కొన్ని కారణములచే నీ గ్రంథము క్లుప్తముగా వ్రాయబడినది. ఇంకను అధికతరమైన సన్న్యాస విషయ, విశేషములతో 'సన్న్యాసము సంప్రదాయము' అను

బృహత్ రూప గ్రంథము మరల రానున్నదని వ్రాయుటకు ఆనందించుచున్నాను.

కావున, మన భారతీయాధ్యాత్మిక సంస్కృతి యొక్క ప్రాముఖ్యతను గ్రహింప శ్రీ అనుభవానంద గురుదేవులు వ్రాసిన గ్రంథముల పఠించి, మన పారమార్థిక సంపదల గొప్పదనమును గ్రహించి, శ్రీ అనుభవానందుల ఆదర్శమును గ్రహింతురుగాక!

మహరాజ్

త్యాగీశానంద

ఓం

# యతి సంప్రదాయము

శ్రీమంతంబు ననాదిసిద్ధమగు నిశ్శ్రేయోపదార్థంబులన్
నీ ముందుంచెడు ఆర్యసంస్కృతికదా నీ వారసత్వంబనన్
సామాన్యంబె త్వదీయ భాగ్యమపురా! సన్న్యాసి! సర్వాధిపా!
కామింతుర్ సురలైన నీ స్థితిని నిక్కంబీవు గుర్తింపరా!

అనాదిసిద్ధమై, పరమైన మోక్ష సంస్థితులను నీ వారసత్వంగా నీ ముందుంచేది నీ ఆర్యసంస్కృతి. అట్టి దివ్య సంస్కృతిలో ఉండటం అసామాన్యము. మహద్భాగ్యము. సన్న్యాసీ! సర్వాధిపా! అట్టి నీ దివ్య స్థితిని దేవతలుకూడా కాంక్షిస్తారన్న సత్యాన్ని నీవు గుర్తించుకో!

ధర్మార్థకామమోక్షములు అనబడు పురుషార్థ చతుష్టయంలో మోక్షానికి; జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయములు. నాబడు అవస్థా చతుష్టయంలో తురీయానికి; నిత్యానిత్య వస్తు వివేకము, ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమాది షట్కసంపత్తి, ముముక్షుత్వములను సాధనచతుష్టయంలో ముముక్షుత్వానికి అగ్రస్థానము యీయబడినట్లుగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాస చతుష్టయంలో యీ సన్న్యాసాశ్రమానికి ఉత్తమ స్థానం యీయబడ్డది. 'గృహాశ్రమో జఘనతః బ్రహ్మచర్యం హృదో మమ। వక్షస్థలాద్వనే వాసః సన్న్యాసః శిరసి స్థితః॥' అను విధంగా ఆశ్రమ చతుష్టయంలో నీ యత్యాశ్రమం శిరోభూషణంగా ప్రకాశిస్తున్నది. దీనికే యత్యాశ్రమమని, తురీయాశ్రమమని నామములున్నవి. ఈ 'సర్వేషామాశ్రమాణాం తు సన్న్యాసీ హ్యుత్తమాశ్రమీ' సర్వాశ్రమములలో సన్న్యాసము ఉత్తమాశ్రమమని హారీత మహర్షి వచనము. ఈ

సన్న్యాసాశ్రమానికి ఎందుకు యీ ప్రత్యేకత? ఈ సన్న్యాసము దేనికి? ఈ సన్న్యాసంవలన ప్రయోజనం ఏమిటి?

The renunciation is only a process of growth preparing for the birth of a fuller life. సమగ్ర జీవితావతరణమునకు సంసిద్ధపరచు పరిణామ క్రమమే సన్న్యాసముగ శ్రీ రామతీర్థస్వామి నిర్వచనము.

'నారాయణం పద్మభవం వశిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ। వ్యాసం శుకం గౌడపదం మహాంతం గోవింద యోగీంద్రమథాస్య శిష్యం॥ శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యం। తం తోటకం వార్తికకారమన్యాన్ అస్మద్గురూన్ సంతతమానతోస్మి॥" అను శ్లోకద్వయాన్ని శ్రీ శంకర సంప్రదాయ సన్న్యాసులు స్మరిస్తుంటారు. అందువలన సన్న్యాసము శ్రీమన్నారాయణునితో ప్రారంభింపబడినట్లు మనకు విది

తము. అనగా యీ సన్న్యాసము శ్రీ నారాయణునినుండి ప్రారంభమై, పద్మసంభవుడగు బ్రహ్మదేవునితో అభివృద్ధి చెంది, తర్వాత బ్రహ్మర్షులచే పోషింపబడినది. అందు ముఖ్యులు. వశిష్ఠ శక్తి పరాశరులును, వ్యాస శుకులును, అటనుండి శ్రీ గౌడపాద, గోవింద శంకరుల మూలముగ పద్మపాద, హస్తామలక, తోటక, సురేశ్వరులచే సర్వవ్యాప్తమును పొందినది. ఇంత వివరముగ చెప్పుట కష్టమై యుండనోపు। అందుచే నీ శ్లోక భావముల నన్నింటిని ఒక్క శ్లోకంలో యిమిడ్చి, 'నారాయణసమారంభాం శంకరాచార్యమధ్యమామ్। అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరం పరామ్॥' అనుచు క్లుప్తంగా చెప్పారు మన పూర్వులు.

ఇందు ప్రస్తావింపబడిన మహాత్ములు ఒక కాలమునకే గాక, ఒక యుగమునకుకూడ చెందినవారు కారు.

వారు నాలుగు యుగాలకు చెందినవారై యున్నారు. అందు 'సత్యయుగసంబంధ్యాచార్య త్రయం బ్రహ్మా విష్ణు రుద్రా శ్చేతి। త్రేతాయుగ సంబంధ్యాచార్యత్రయం వశిష్ఠ శక్తి పరాశరా శ్చేతి। ద్వాపరసంబంధ్యాచార్యౌ ద్వౌ వ్యాసశుక దేవౌ। కలియుగ సంబంధ్యాచార్య త్రయం గౌడ గోవింద శంకరాచార్యా శ్చేతి।' సత్యయుగమునకు మూర్తిత్రయ మును, త్రేతాయుగమునకు వశిష్ఠ శక్తి పరాశరులును, ద్వాపరయుగమునకు వ్యాసశుకులును, కలియుగమునకు గౌడ గోవింద శంకరులు ఆచార్యవర్యులు. అనగా యీ మానవోద్ధరణ మహత్కార్యము యుగయుగములనుండి అవిచ్ఛిన్నలీల సాగుచున్నది. అందు మానవులుమాత్రమే గాక మూర్తిత్రయంకూడ పాల్గొనుట గమనార్హం. పైన చెప్పబడిన మహాత్ములెల్లరు సన్న్యాసాన్ని అభిమానించుతూ, సర్వవ్యాప్తం కావటానికి ప్రబల కారకులని విదితం అవుతున్నది.

ఈ విధంగా సర్వప్రఖ్యాతమై, సర్వవ్యాప్తమైన సన్న్యాసమునకు ఎందుకు యీ ప్రాముఖ్యత? కారణం ఏమిటి? సర్వవిధ ఆకర్షణలతోనూడి, మానవుని తనలో చేర్చుకొనుటకై ప్రయత్నించు ప్రపంచాన్ని గడ్డిపోచతో సమానంగా తిలకించి, భగవంతుని మాయను గావించు అఖిల విధానములకు దూరంగా ఉండి, ప్రపంచాతీతంగా ఉండగలగటం ప్రశంసార్హంకదా! అదే సన్న్యాసి శ్రేష్ఠత్వం! పశుతుల్యుడైన మానవుడు తన పశుత్వాన్ని నశింపజేసికొని, మానవత్వాన్ని నింపుకొని, తీవ్ర ముముక్షువై, యథార్థ శిష్యుడై, ఉత్తమ సాధకుడై, సక్రమ సన్న్యాసి యగుట పూర్వజన్మ సుకృత సంస్కార ఫలితం అనక తప్పదు. అందుచేతనే 'బ్రహ్మనిష్ఠః పరమహంసః సాక్షాన్నారాయణస్మృతః' అని శాస్త్రము నారాయణునితో సమానత్వం, పూజ్యత్వం, పరమహంస సన్న్యాసికి అన్వయించినది. అంతియగాక 'యతిర్నారాయణసాక్షాత్' యతి సాక్షాత్తు

నారాయణస్వరూపునిగ నుతించియున్నది. సకల దేవతాగణ శ్రేష్ఠుడగు నారాయణునిగ యతి కీర్తింపబడుటయేగాక సన్న్యాసిని గౌరవించుట సర్వదేవతల గౌరవించుటయే అని కూడా శాస్త్రం ప్రబోధించినది. 'యతిశ్చ పూజ్యమానశ్చేత్ సర్వే దేవాః సుపూజితాః' అనియు నుతించుటలో ఆశ్చర్యము లేదు.

ఈ విధముగ సర్వసంగపరిత్యాగియైన సన్న్యాసి, సర్వశక్తి సమేతులయిన దేవతాగణముతో పోల్చబడుట గాంచనగును. శక్తికి, విరక్తికి సమాన గౌరవము సముచితమే కదా! శ్రీరామచంద్రుడు వశిష్ఠుని అధికతమముగా గౌరవించుట గ్రంథములు గోచరించును. అట్లే పూర్వకాలములు రాజగురువులుగ మహర్షులుండి, రాజ్యపాలనమును గూడ చక్రవర్తులచే చేయించుట చూడదగును. ఈ విధముగ నరణ్యముల మధ్యన ఆశ్రమములో నేకాకిగ నున్నను,

రాజాస్థానమున ఉత్తమాసనమున నాసీనులై చక్రవర్తులకు సలహాలనిచ్చుచున్నను, తమ సర్వాతీత స్థితికి అంతరాయము కలుగని విధమున పూర్వాకాలముల యతిగణము త్యాగమునే ముఖ్యముగ గ్రహించి, తమ జీవితాదర్శముల మరువక, తమ ఆధ్యాత్మిక దివ్యానంద వైభవమున నీదులాడుచు, పవిత్రముగ ప్రవర్తించెడివారు. ఆ మహనీయుల చిత్తముల నలంకరించి నిత్య జ్యోతిష్యై 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్త్వమానశుః' అను కైవల్యోపనిషద్వాక్యము ప్రకాశించుచుండును. కర్మలచేగాని, పుత్రులచేగాని, ధనసంపదలచేగాని అమృతత్త్వము లభింపదు. ఒక్క త్యాగముచేత మాత్రమే సాధ్యమని యీ మంత్ర తాత్పర్యము. అందుచేత త్యాగమూర్తితో తులతూగుటకు దేవతలకే సాధ్యము కానపుడు యిక సామాన్య మానవులకు సాధ్యమా? 'వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగా ద్యతయః శుద్ధ సత్త్వాః। తే బ్రహ్మలోకేషు పరాంతకాలే

పరామృతాత్పరిముచ్యంతి సర్వే॥' సునిశ్చితార్థులై, వేదాంత విజ్ఞానతత్పరులైన యతులు సన్న్యాసయోగముచే శుద్ధ సత్వులగుచున్నారు. వారందరు బ్రహ్మ లోకమువందు అమృతత్త్వమును పొందుచున్నారు. అనగా యీ సన్న్యాస మహిమముచే మానవులు యీ లోకమునకు అతీతముగ నుండి, జయించుటయేగాక బ్రహ్మలోకమును పొందుచున్నా రనుట తథ్యము. అందుచే నీ సన్న్యాస మహాత్వము యీ లోకముననేగాక అన్యమైన పరకలోమునగూడ తన అద్వితీయ ప్రభావమును చూపుతున్నది.

అసలు సన్న్యాసమునకు అర్థం ఏమిటి? సత్ + న్యాసః అని సన్న్యాసశబ్ద విభాగము. 'సత్' రూపమైన బ్రహ్మములో లయం చెందటమే సన్న్యాసమునకు అర్థము. ఆత్మయందు అజ్ఞానముచే ఆవరింపబడినట్లు గోచరించిన ప్రపంచమును లయింపజేయుటయే సన్న్యాసము. ఈ

సన్న్యాసికి 'ముని' అనియు, 'భిక్షువు' అనియు 'అవధూత' అనియు ననేక నామాంతరములు కాలమునననుసరించి ఏర్పడి నవి. 'అహంకార మమకారత్యాగ ఏవ సన్న్యాసో వక్ష్యతే। నాశేష శాస్త్రార్థత్యాగః' అహంకారమమకారముల త్యాగమే సన్న్యాసమనియు, బహుళములగు శాస్త్రార్థముల ద్యజించుట కాదనియు, విజ్ఞుల మడి. మరియు కర్మత్యాగమేకాక సకల కోరికలను పరిత్యజించుటే సన్న్యాస లక్షణము. 'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।' మనోగతము లైన సకల కామములను ఎప్పుడు వదలునో అనియు, 'విహాయ కామాన్ యస్సర్వాన్' సర్వ కామముల నెప్పుడు త్యజించునో అనియు పై నిర్వచనమునే శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతయందు స్పష్టీకరించెను. అట్టి కామ విజేతయే 'సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ' సుఖ దుఃఖ, లాభాలాభ, జయాపజయాది ద్వంద్వముల సమదృష్టి వీక్షించి, ద్వంద్వముల నతీతించి, సర్వుల సమదృష్టి తిల



క్రింపగలడు. అందుచేతనే 'బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయ అథ భిక్షాచర్యం చరంతి' అని బృహదారణ్యకోపనిషద్వాక్యము. త్యాగమూర్తులగు బ్రహ్మవేత్తలు పుత్రేషణ, ధనేషణ, లోకేషణములు అనబడు నా ఈషణత్రయమును త్యజించి, భిక్షులగుచున్నారు. అనగా సన్న్యాసి భార్యా. పుత్ర, ధనములను ఈ లోకసంబంధములనేగాక, వైకుంఠ కైలాసాది లోక నివాస కాంక్షలగూడ వర్జింపవలెను. ఈ విధముగా సర్వ త్యాగధనుడే సన్న్యాసి యను సుస్పష్టార్థముతో మాత్రమే 'త్యాగేనైకే అమృతత్త్వ మానశుః' అని గాథ వేదవచనము. అట్టి త్యాగమూర్తి వందనీయుడు. అట్టి మహాత్ముడు ధన్యాతిధన్యుడు.

ఈ సన్న్యాసమునకు యీ ప్రత్యేకత ఎందుకు అను ప్రశ్న ఉదయించుట సహజము. 'సన్న్యాసాత్ బ్రహ్మణః స్థానం' సన్న్యాసమువలననే బ్రహ్మస్థానమనియు, 'న

సన్న్యసాత్ పరో ధర్మః వర్తతే ముక్తి కారణం' సన్న్యా సముకంటె ముక్తిప్రదమగు ధర్మము అభావమనియు, 'సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి' సన్న్యాసమువలననే సిద్ధిని పొందగలుగుచున్నారనియు ఉపనిషత్తులు ఉద్ఘోషించు చున్నవి. 'సన్న్యసనాదేవ నరకాత్తారయేత్పితౄన్' సన్న్య సించుటవలనమాత్రమే నరకమునుండి పితృదేవతలను తరింపజేయునని దక్షస్మృతియు ప్రబోధించుచున్నది. తాను తరించి, యితరుల తరింపజేయుటకు యీ సన్న్యా సము ఉపకరించునని పై వాక్య సారాంశము.

అట్లయిన యీ ఆశ్రమ స్వీకరణమునకు అధికారి ఎవడు? చతుర్విధ జీవరాసులలో నగ్రస్థానమును వహిం చిన మానవుడు. ఆ మానవులలోగూడ 'ధర్మో మూలం మనుష్యాణాం' మానవులకు ధర్మమే మూలమనురీతి ధర్మా చరణశీలుడైన మానవుడని అర్థము. పశుత్వమును పార

ద్రోలి, మానవత్వమును ధరించి, దివ్యత్వమును పొందద అభిలషించి పశుపతి అగుటకు ప్రయత్నించు మానవుడు. లేక శ్రీ వ్యాసభగవానుడు తన బ్రహ్మసూత్రములలో వచించినట్లుగా 'హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్' హృదయ ప్రాధాన్యతయే మానవుని మోక్షాధికారిగ దయా రానర్చును. త్యాగధనుడై, కామమూఢుడై, సుసంస్కార శీలుడై, విద్యాసాధనల నపేక్షించువాడై, యమనియమా ద్యష్టాంగ సుశోభితుడై, అస్ఖలిత బ్రహ్మచర్యదీక్షాయుతుడై, కళంకమన నేమియో ఎరుగనివాడే యీ ఆశ్రమమునకు శిరోభూషణమై, సర్వాధికారియై, విశిష్టతను అందించ గలడు. అందువలననే 'సాత్త్వికాయాంతర్ముఖాయ పరి శుశ్రూషవే' సత్వసంపన్నునికి, అంతర్ముఖ చిత్తునికి, శుశ్రూషాపరునికి అని మహావాక్యోపనిషత్తును, 'సేవాపరాయ శిష్యాయ మద్భక్తాయ సుశీలాయ కులీనాయ సుమేధసే' సేవాపరుడును, మంచిశీల ... గలవాడును, కులీనుడును,

మేధాసంపన్నుడును, భగవద్భక్తియుతుడును అయిన శిష్యునికి ఉపదేశింపుమని ముక్తికోపనిషత్తును అధికారి నిర్వచనమును గావించినవి.

అయిన నీ తురీయాశ్రమాన్ని ఎప్పుడు స్వీకరించాలనేది ఒక సందేహం. 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్' అనియు, 'సన్న్యసేద్బ్రహ్మచర్యేణ' బ్రహ్మచర్యము నుండియే సన్న్యసింపవలయుననియు, 'యదహరేవ విరక్తదహరేవ ప్రవ్రజేత్' ఎప్పుడు వైరాగ్యము కలుగునో అప్పుడే సన్న్యసింపవలయునని ఉపనిత్తులును, 'ప్రవ్రజేత్ బ్రహ్మచర్యాత్తు యదిచ్ఛేత్పరమాం గతిం' పరమగమ్యమగు ముక్తి కావలయునని బ్రహ్మచర్యమునుండి సన్న్యసింపవలయును అని యమస్మృతియు, బ్రహ్మచర్యాశ్రమము నుండియే యత్యాశ్రమమును స్వీకరింపవలయునని దృఢముగా పలికినవి. 'యదా మన సివైరాగ్యం జాయతే

సర్వవస్తుషు తదైవ సన్న్యసేద్విద్వాన్ ....॥' సమస్త వస్తు సముదాయమునందు ఎప్పుడు విరక్తి జనించునో వెంటనే విద్వాంసుడు సన్న్యసమును స్వీకరింపవలయునని సౌరపురాణముగూడ బోధించుచున్నది. పై విధముగ 'సన్న్యస్తం తు ద్విజం దృష్ట్వా స్థానాచ్చలతి భాస్కరః' సన్న్యసించినవానిని గాంచి భాస్కరుడుగూడ తన స్థానము నుండి చలించును అను విష్ణుపురాణ వచనమురీతి యథార్థ ముముక్షుపై, బాల్యమాదిగ వైరాగ్య సంశోభితుడై, తీవ్ర ఆవేదనాసంభరితుడై, సద్గురు చరణసరోజముల నాశ్రయించి, శుశ్రూషాధ్యయన, క్రమసాధన, క్రమశిక్షణాదుల చేత తేజోమయుడై, 'బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్య లాభః' అను పాతంజల యోగసూత్ర గ్రహణముచే బ్రహ్మ చర్య ప్రాభవమును తెలిసికొని, తురీయాశ్రమమును గైకొనినవాడు తాను శాంతిని పొంది, లోకమునకు శాంతిని ప్రసాదించగలడనుటలో సందేహము లేదు. లోకశాంతి

ప్రదాతమైన ఆ ధీశాలికి రాజ్యపరిపాలన చేయుట కష్టము కాదు. వాని ధీశక్తి పండితుల సంస్తుతులను అందుకొనును. వాని ప్రశాంత వచనము సాధకులకు సంతోషమును ఒసగును. వాని చిరునవ్వు పరితప్త హృదయులకు హాయి నందించును. వాని అనుభవపూరిత మృదుమధుర సంభాషణము పవిత్ర హృదయకుహరముల ప్రవేశించి కర్తవ్య నిర్వాహణమును కలిగించును. వాని పవిత్ర దృష్టి సాధకులకు స్ఫూర్తిని కలిగించి, పాప సంచయముల దూరీకృతము గావించును. శుద్ధ సంస్కారముల కలిగి, సక్రమ బ్రహ్మచర్య పరిపాలనముగావించి, సాధనాదుల సక్రమముగ నిర్వహించి. బ్రహ్మత్వమును పొందిన దివ్య పురుషుడు లోకములో నివసించుచు, లోకస్థులకు దూరుడై, లోకాతీత స్థితిలో ఉండగలడు. అది వాడి తీవ్ర సాధనాపటిమవలన కలిగిన విజయము. అట్టిది యీ బ్రహ్మచర్యాశ్రమము నుండి సన్న్యసించినవాని ప్రాశస్త్యము. అందుచేతనే 'మేరు

సర్షపయోర్యద్వత్ సూర్యఖద్యోతయోరివ। సరిత్సాగర యోర్యద్వత్ తథా భిక్షు గృహస్థయోః॥' మేరుపర్వతము నకు ఆవగింజకును, సూర్యునకు మిణుగురు పురుగునకును, సముద్రమునకు సరస్సునకును ఎంత తారతమ్యము కలదో అదే విధముగా సన్న్యాసి గృహస్థులకును మధ్య అంత తారతమ్యము కలదని శాస్త్రోపదేశము. ఇది ముమ్మాటికిని సత్యమే కదా। సర్వ కోరికలలో మునిగి యున్నవానికి, సమస్త కామముల నతీతించినవానికిని ఎంత వ్యత్యాసము। మనో నిగ్రహానికి మనో చాంచల్యానికి ఎంత భేదము।

పై విధంగా బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించ లేనివారికిగూడ మాతృరూపిణి యగు వేదమాత అపార ప్రేమతో 'గృహోవా వనో వా' అనియు, 'గృహద్వా వనాద్వా' అనియు, 'బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, 'గృహా ద్వనీ భూత్వా ప్రవ్రజేత్' అనియు ప్రబోధించినది. గృహస్థా శ్రమమునుండిగాని, వానప్రస్థమునుండిగాని సన్న్యసించు

టకు అవకాశము కలదు. అట్లయిన గృహస్థమునుండియో, లేక వానప్రస్థమునుండియో సన్న్యసించుట అనినచో 'విరక్తః సర్వ కామేభ్యో పారివ్రాజ్యం సమాశ్రయేత్' సమస్త కామములనుండి విరక్తి జనించినపుడు పరివ్రాజకత్వమును ఆశ్రయింపవలయును అని మరల శాస్త్రాదేశము. ఇచట వైరాగ్యమునకు ప్రాధాన్యత యీయబడినది. అందు వలననే 'పరం వైరాగ్యం' కావాలి. ఆ వైరాగ్యానికి తోడుగా 'అభ్యాసం' కూడా ఉండాలి. అందుచేతనే 'అభ్యాస వైరాగ్యాభ్యాం' అని శ్రీ పతంజలి మహర్షి ప్రబోధించాడు. ఇందులో స్త్రీపురుష తారతమ్యము ఏమాత్రము లేదు.

అష్టోత్తరశతోపనిషత్తులలో కొన్ని యుపనిషత్తులు కేవల సన్న్యాస పరములై, యీ సన్న్యాసమును అనేక విధములుగ వివరించినవి, 'కుటీచకో బహూదకో హంసః పరమహంస ఇత్యేతే పరివ్రాజకాః చతుర్విధా భవంతి' అని

శాట్యాయనీ ఉపనిషత్తు యీ సన్న్యాసమును నాలుగు విధములుగ విభజించినది. సన్న్యాస దీక్షను స్వీకరించి, శిఖా యజ్ఞోపవీతముల విసర్జింపక, సంధ్యావందన దేవతార్చనాదికముల బాటించుచు, తన కుటుంబమునకు దూరముగ నా గ్రామముననే ఒక వనమున నివసించుచు, ఆహార పానీయములకు స్వగృముహపై నాధారపడియుండుట కుటీచక సన్న్యాసమగును. అంత గృహమును, గ్రామమును వదలి, దేశమున అనేకస్థానముల నున్న వివిధ సన్న్యాసుల నాశ్రయించి, శాస్త్రవిషయ గ్రహణము చేయుచుండుట బహూదక సన్న్యాసము. పిమ్మట ఒక సన్న్యాసిని గురువుగ స్వీకరించి, శిఖాయజ్ఞోపవీతముల బరిత్యజించి, సన్న్యాస దీక్షను గురుపరంపరగ గైకొనుట హంస సన్న్యాసము. నాబడును. ఇందు దేవతారాధనము సవర్ణ భిక్షల నియమములుండును. అంత చతుర్థమైనది. పూర్వమువలె కాషాయ

వస్త్రధారణము సామాన్యము. 'తరుతలవాసః కరతల భిక్షః' అనురీతి ఆత్మస్థితిలో నుండువాడు పరమహంస.

మరియు, 'సన్న్యాసః షడ్విధో భవతి' కుటీచక బహూదక, హంసః, పరమహంసః, తురీయాతీతావధూత శ్చేతి' అని నారద పరివ్రాజకోపనిషత్తు వివరణము. కుటీ చక, బహూదక, హంస, పరమహంసలకు తురీయాతీత అవధూతలను రెండింటిని చేర్చి, ఆరు విధములుగ సన్న్యా సము ను యీ ఉపనిషత్తు నిర్వచించియున్నది. తురీయ అవధూతలకు వస్త్ర నియమముకూడ యుండదు. వస్త్రము నకు ఏ వర్ణమైన ఉండవచ్చును. మరియు నసలు వస్త్రమే లేక ఒక కౌపినమే యుండవచ్చును. ఆ కౌపీనముకూడ లేక దిగంబరియై, సన్న్యాసి నియమములేలేక యుండువాడు అవధూత అనియు అర్థము. అట్టివాడు శాస్త్రాతీతుడు, ప్రపం చాతీతుడు, సర్వాతీతుడు.

ఇట్లు సర్వత్యాగముల గావించు యతివర్యులకు గూడ శాస్త్రమే ఆధారము. గురు వాక్యములు అవలంబనీయములు. అందుచేత ఎటువంటివాడైనను శాస్త్రమునను సరించి శాస్త్రాతీతస్థితిని పొందవలయును. 'సాదనత్వేనా దృష్టానాం సర్వేషామపి కర్మణాం। విధినా యః పరిత్యాగః స సన్న్యాసః సతాం మతః॥' అను వాక్యమున 'విధినా' అని వచింపబడియున్నదిగదా! అందువలన సర్వాతీతుడగు సన్న్యాసియైనను దేశకాలములననుసరించుచు వానికి అంటక, మమకారముల ద్యజించి, అతీతుడై యుండవలసిన విధి కలదు. అన్నిటికి అతీతుడని శాస్త్ర, - సంఘ నియమముల బాటింపక, యిష్టము వచ్చినట్లు ప్రవర్తించుట హీనము. సంఘమున వసింపుచు, సంఘమునకు అతీత స్థితిలో నుండుటయే సన్న్యాసి ధర్మము.

ఈ విధముగ సర్వాశ్రయమై, సర్వాతీతమై, పరమ పవిత్రమై, సర్వవ్యాప్తమైన సన్న్యాసమునకు ఆధారము వేదము. వేదమే సన్న్యాసమునకు పరమ ప్రమాణము. అందువలననే 'శ్రుతి స్మృతి విరోధే తు శ్రుతిరేవ గరీయసీ' శ్రుతి స్మృతులలో విరుద్ధత్వము సంభవించినచో శ్రుతియే గొప్పదని ఉపనిషద్వాక్యము. వేదమనగా సకల శ్రేయో మార్గముల బోధించి, ఆచరణ మార్గముల విశద పరచు మాతృదేవతయే యగుచున్నది. ఆ విధముగ సర్వ శ్రేయములను ఉపదేశించునది కావుననే అది వేదధర్మము అనబడినది. మతమనగా వ్యక్తిగతమగుటయు, ఇది వ్యక్తి ప్రోక్తము కాకుండుటచే వేదమతము అనబడక వేద ధర్మము నాబడినది. పాక్షికముగ వ్యవహరించు శైవ వైష్ణవ శాక్తములేమి, క్రైస్తవ మహమ్మదీయ బౌద్ధము లేమి మతములనబడినవి. అట్లుకాక నీ ఆర్యవిధానము ఆర్యమతమనబడక, ఆర్య ధర్మమై, వేదధర్మమనబడి

యున్నది. మతము ఒక లేక కొందరి మనస్సులపై ఆధారపడియుండును. మరియు, మతము తత్సంబంధమైన కొందరికే అన్వయించును. కాని వేదధర్మము సర్వదేశములకు, సర్వకాలములకు, సకల మానవులకును అన్వయించు పరమ ధర్మము. మతప్రవక్తలకు, మతోద్ధారకులకు, మత సంస్థాపకులకు, మతానుయాయులకు ధర్మము అనుసరణీయము. ధర్మము వినా మానవుల మనుగడయే లేదు. అందువలననే ధర్మము చెప్పనది కాదనియు, 'ధర్మం చర' ధర్మములు ఆచరింపవలెననియు వేదము యొక్క ఆదేశము. ఈ ధర్మ ప్రాముఖ్యమును గుర్తించి, 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' అని కణాద ఋషిపుంగవుడు తన వైశేషిక సూత్ర గ్రంథమును ధర్మ వ్యాఖ్యానముతో ప్రారంభించెను. 'యతోభ్యుదయనిఃశ్రేయస సిద్ధిః స ధర్మః' దేనిచే తత్త్వజ్ఞానాభివృద్ధియు, మోక్ష సిద్ధియు కలుగునో అదియే ధర్మముగా ఆన గ్రంథమున,

ద్వితీయ సూత్రమున సూచించెను. మరియు, నీ ధర్మ విశిష్టత్వమును గ్రహించి, 'అథాతో ధర్మజిజ్ఞాసః' అని జైమిని ముని చంద్రుడు తన పూర్వ మీమాంసాసూత్ర గ్రంథమును రచించెను. 'చోధనా లక్షణోర్థో ధర్మః' ప్రవృత్తి కారణమైనది ధర్మమని నిర్వచనము. అందు వలననే 'ధర్మేణ గమనమూర్ధ్వం' ధర్మముచే ఊర్ధ్వ గమనమని మానవునికి శాస్త్రోపదేశము. అందుచేతనే ధర్మబద్ధుడు మానవుడు.

పై విధముగ వేద ప్రోక్త సన్న్యాసము, అనాది సిద్ధమైన సన్న్యాసము, కపిల కణాదాది యతీంద్రులచే పోషింపబడుచు వచ్చుచున్నను, కాలక్రమమున అభివృద్ధితో పాటు దోషములుకూడ పెరుగసాగెను. కాలము ననుస రించి, సన్న్యాసము కొన్ని శాఖలకే ముఖ్యమై అన్వయ మగుచున్నను, అది ప్రపంచ వ్యాప్తమై, మిక్కిలి గౌర

వాదరములను పొందుచున్నది. సూక్ష్మబుద్ధితో పరిశీలించి నచో త్యాగము ఏ మతమునకుగాని, ఏ దేశమునకుగాని, చెందక సర్వ ప్రపంచమునకు చెందియున్నది. దేశ, కాలముల ననుసరించి అది అనేక రూపాంతరముల పొందియున్నది. శ్రీ శంకరాచార్యులకు పూర్వము బౌద్ధ, జైన, మతములు, బుద్ధ జిన మహాత్ముల మూలమున ప్రపంచ వ్యాప్తమై యున్నవి. కొన్ని యుగముల క్రితము, కపిల కణాద పంచశిఖులచే బోషింపబడిన యీ సన్న్యాసము పేరెన్నిక నార్జించుకొని, ఎల్లరచే గౌరవాదరముల సంపాదించుకొని, 'నారాయణం పద్మభవం.........' అను శ్లోకమున పూర్వము వచించిన విధముగా యుగయుగముల వ్యాపించుటయేగాక, బ్రహ్మ విష్ణు మహేశ్వరులచే పోషింపబడి, క్రమముగ పూర్వము వచించియున్నటుల ఒక పరంపరగ శ్రీ శంకర సంప్రదాయమున విజృంభించుటయే గాక, ముఖ్యముగ 'శ్వేతకేతు ఋషు నిదాఘ జడభరత

ఋషభ దూర్వాస సంవర్తక సనత్సుజాత వైదేహ వట
సిద్ధ శుక వామదేవ దత్తాత్రేయ రైవతక గోవిందవధూతల,
చేత అవలంబింపబడుచు మనకు అందియున్నది. ఇందు
ఆ యా దేశముల, త్యాగమహిమచే అచంచల కీర్తిని
ఆర్జించియున్న వ్యక్తుల నామములుమాత్రమే చెప్పబడి
యున్నవి. కాని కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుటకు యిష్ట
పడని సన్న్యాసులు, కీర్తిని సంపాదింపజాలని యతులు
ఎందరు కాలగర్భమున కలసిపోయిరో! ఈ విధముగా పరి
శీలించినచో సన్న్యాసము సర్వ ప్రపంచమున వ్యాపించి,
సర్వ కాలముల ప్రఖ్యాత గౌరవమును పొందియున్నది.
దేశ కాల వాతావరణ పరిస్థితుల ననుసరించి, మానవుల
ఆహార వ్యవహారములు మార్పు చెందుచుండినట్లుగా యీ
సన్న్యాస విధానమునకూడ అనేక మార్పులు కలిగినవి. కాల
మునను సరించి, ఆచారవ్యవహారములు వివిధరీతుల సంస్క
రింపబడినట్లు యీ సన్న్యాసముకూడ మార్పు చెందినది.

కాని అనాది కాలమునుండి పరిశీలించినచో సన్న్యా సుల నామములు అగోచరములు. వానప్రస్థులుగ నున్న నాటి నామములే శాస్త్రమున గోచరముగాని సన్న్యాస నామ ధేయములు అలభ్యము. వానప్రస్థులు సన్న్యసించిన వెంటనే తమ పూర్వ నామ వ్యవహారముల వదలి, సర్వ సంబంధముల విడనాడి, అరణ్యముల సర్వాతీతులై పూర్వము ఉండెడివారు. వారు ప్రపంచముతో ఎటువంటి సంబంధమును పెట్టుకొనెడివారు కాదు. అందుచే పూర్వము సన్న్యాసులు, తమ పూర్వ నామములగూడ వర్జించినను, వారి వానప్రస్థ నామములే మనకు శాస్త్రముల తెలియు చున్నవి, కాని వారి సన్న్యాస నామధేయములు మాత్రము తెలియలేదు.

కాని బుద్ధుని కాలమునకు పూర్వ స్థితిలో కొంత మార్పు ఏర్పడినది. సిద్ధార్థుడు బుద్ధుడై ప్రఖ్యాతిని పొంద

ట్రయు, ఆయనచే బోధింపబడినది సనాతన తత్త్వమై యున్నను కొన్ని ప్రత్యేకతలుండుటచేత, బుద్ధుని పేరుతో నది బౌద్ధమతముగా పరిణమించినది. అదే విధముగా జిన మహర్షిచే బ్రబోధింపబడినది జైనమతమయినది. వాని వాని ఆచారవ్యవహారములు కొన్ని సమయముల, సనాతన ధర్మ విరుద్ధమై ప్రవర్తించుచుండెను. కొన్ని సందర్భములలో, వేదధర్మమునకు విరుద్ధముగ ప్రవర్తించు నా వ్యవహారము లకు, వారికి ప్రత్యేక ఆధారములు కలవని వచించుచు, అన్య సంప్రదాయమును మహర్షులనుండి గ్రహించి వీరు చాటుకొనుచుండిరి.

అందులకు చింతించి, శ్రీ శంకరాచార్యులు అవత రించి, సనాతన, వైదిక సంప్రదాయమును ఉద్ధరించి, దేశ వ్యాప్తిగ ప్రచారము గావింప దీక్షా కంకణమును ధరించి, సనాతన సన్న్యాస సంప్రదాయమును అన్వేషించి, గోవింద

భగవత్పాదులను ఆశ్రయించి, యత్యాశ్రమమును స్వీకరించి, శ్రీ శంకర భగవత్పాదులుగా మార్పు చెందెను. తనకు పూర్వము, అనాదికాలమునుండి సన్న్యాసమునకు కావలసిన కట్టుబాట్లు లేక, పరస్పర సంబంధములేక, ప్రత్యేకముగ నుండిన సన్న్యాసులను కొంతవరకు క్రమపరచుటకు శ్రీ శంకరుడు నిశ్చయించెను. కాన యీ విషయమున దీర్ఘ ముగ, తీవ్రముగ ఆలోచించి, బ్రహ్మచర్యమునుండి సన్న్యా సము అవసరమగుటచే బ్రహ్మచర్యమునుండికాని, గృహస్థా శ్రమమునుండి కాని, వానప్రస్థమునుండి కాని సన్యసించు టకు నిర్ణయించుకొనినవాడు, సన్యాసియైన గురు సన్నిధానమున కొంతకాలము క్రమశిక్షణమున నుండుచు, అధ్యయన, వేదాం తశ్రవణ, సాధనాదుల సలుపుచు నుండవలయునను ఏర్పాటు గావించెను. ఆ బ్రహ్మచారులకు ఆనంద, చైతన్య మొద లగు నామముల కొన్నింటిని ఏర్పరచి, వారి ప్రవర్తనమునకు కొన్ని విధి నిషేధములను నియమించి, ప్రథమతః సన్యాసి

కొనున్నవారికి క్రమ శిక్షణములను, క్రమ ప్రవర్తనము లను, క్రమ సాధనల నేర్పాటు గావించెను. మరియు భారత దేశమును నాలుగు దిక్కులుగ, నాలుగు భాగములుగా విభజించి. తూర్పున పూరీ జగన్నాథమున, గోవర్ధన పీఠమును, పశ్చిమమున, ద్వారకలో శారదా పీఠమును, దక్షిణమున, శృంగేరిలో, శృంగేరి శారదా పీఠమును, ఉత్తరమున హిమాలయ పర్వతముల మధ్య జ్యోతిర్మఠ పీఠమును స్థాపించి, భారత దేశమున గల సన్న్యాసులను అందరిని తగిన స్థితిలో నుంచు అధికారమును శ్రీ శంకరులు అనుగ్రహించిరి. భారత దేశమును చతుర్విధముగ విభాగించి, నాలుగు దిక్కులల, నాలుగు పీఠముల నేర్పరచి, ఆ స్థానముల సన్న్యాసులనేగాక గృహస్థులనుగూడ తగు విధానమున వ్యవహరింప కట్టుదిట్టముల గావించెను.

ఈ విధముగ దేశమంతటిని తన దివ్య ప్రభావముచే ప్రకాశింపజేసిన శ్రీ శంకర భగవత్పాదులు, సన్న్యా



సులకు ప్రత్యేక నామకరణములను ఏర్పాటు చేయ నిశ్చయించెను. దేశమున బౌద్ధ, జైనాది సన్న్యాసులు, మరియు ప్రఖ్యాతముగాని మరికొన్ని సంప్రదాయములు ఉండుటచేత, తన సంప్రదాయమునకు ఒక ప్రత్యేకతయు, క్రమశిక్షణయు ఉండవలయునని ఆయన సంకల్పించెను. అందులకై ఆ అపర సృష్టికర్తయగు నా శ్రీ శంకరులు దశనామ సంప్రదాయ సన్న్యాసమును సృజించినట్లు సంప్రదాయము. అంతవరకు గురువులను ఆచార్యులని యనుట పరిపాటియై యుండెను. ఆ యాచారము ననుసరించి ఆ మహనీయుడు, తన శిష్యులను గూడ 'ఆచార్య' శబ్దముతో నలంకరించుట సుస్పష్టము. కావున తన సంప్రదాయమున నేర్పాటు గావింపబడిన పై నాలుగు పీఠములలో సన్న్యసించిన యతులు, తమ సన్న్యాసనామముల చివర వహించుటకు పది శబ్దముల సూచించెను. అవియే 'తీర్థాశ్రమ వనారణ్య గిరిపర్వత సాగరాః। సరస్వతీ భారతీ చ పురి నామాని వై

దశ॥" అని ప్రకృతి దేవి సంబంధ నామములు పది. సన్న్యాసి ప్రకృతి సిద్ధముగ నుండవలయుననియు, సాంఘిక వ్యవహారములకు అతీతముగ నుండవలయునని శ్రీ శంకరుల విశ్వాసము. ప్రకృతితో సత్సంబంధముల పెంపొందింప జేసికొని సన్న్యాసి యుండవలయుననియు, అందువలన సన్న్యాసి సర్వాతీతుడై, నిత్య నిర్మలముగ నుండగలుగునని శ్రీ శంకరుల ఉద్దేశ్యమై యుండవచ్చును. ఆ విధముగ తనచే ప్రకటింపబడిన దశనామ సన్న్యాస సంప్రదాయమును శ్రీ శంకరులు నాలుగుగా విభజించి, తనచే స్థాపింప బడిన నాలుగు పీఠములకు విభాగము గావించి, ఆయా పీఠములలో సన్న్యసించిన వారికి, ఆయా ఉపనామములను పెట్టవలయునని శాసించెను. అందుచేతనే పూర్వమునగల సన్న్యాసులకంటె శ్రీశంకరానుచరులు ప్రత్యేకింపబడి, ప్రత్యేక వ్యక్తిత్వమును సంపాదించిరి. ఈ దశనామములు కాక కాలగతమున 'ఇంద్ర సరస్వతి' నాబడు

సన్యాస సంప్రదాయము ఒకటి పుట్టెంచెను. పూర్వముండిన అద్వైతమును ఉద్ధరించి శ్రీశంకరులు గ్రంధముల రచించుటవలన అద్వైతము శంకరాద్వైతము అయినట్లుగా సన్యాసము కూడ అనాదికాలగతమై యున్నను, అనేక ప్రఖ్యాత ఋషిపుంగవులచే బోషింపబడియున్నను, శ్రీ శంకరుల అపార వ్యక్తిత్వము వలన శ్రీ శంకర సంప్రదాయ సన్యాసముగ ప్రశస్తిని ఆర్జించి, చక్రవర్తులచేత పోషింపబడి యున్నది. వ్యాప్తిమాత్రమేగాక, గృహస్తులకు అండ దండగనుండి, శాస్త్రవిషయములమాత్రమేగాక, నిత్యజీవిత వ్యవహారములగూడ గ్రిమత్వమును ప్రసాదించినదను కీర్తిని గడించియున్నది ఈ సంప్రదాయము.

అంత, దేశమున కొన్ని మార్పులు సంభవించెను. ప్రఖ్యాత వ్యక్తులు అవతరించిరి. శ్రీ రామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు అవిర్భవించిరి. వారి వారి వ్యక్తిత్వ

ప్రాధాన్యమున విశిష్టాద్వైత, ద్వైత మతములు ఏర్పడి నట్లుగా శ్రీ రామానుజ, శ్రీ మధ్వ సాంప్రదాయిక సన్యాసులు కూడ ఏర్పడిరి. శ్రీ మధ్వాచార్యులు, శ్రీ శంకర సాంప్రదాయకమైన దశ నామములలో "తీర్థ" నామమును గాక, సామాన్య ప్రజల బాధలను ఏవిధమైనను రూపుమాపుచు ఆధ్యాత్మికముగ తపో విధానము నవలంభించి, ప్రశాంత తమ సన్న్యాసులకు యిచ్చుచుండిరి. ఈ యిరువురు ఆచార్యులుకూడ కాషాయాంబరములనే స్వీకరించియుండిరి. కాలక్రమమున నివి దక్షిణమున ప్రసరింపగా, గోరక్షనాధ మొదలగు మహాత్ములచే ఉత్తర దేశమున వ్యాప్తినొంది, అనేక సంప్రదాయములు ఉదయించెను. శ్రీ దయానందుల ప్రభావముచే ఆర్యసమాజ సంప్రదాయము, శ్రీ రామకృష్ణ వివేకానందులచే శ్రీ రామకృష్ణ సంప్రదాయము, సర్వవ్యాప్త మగు కీర్తి ప్రతిష్ఠలను పొందియున్నవి. శ్రీ రామకృష్ణ ని సంప్రదాయము, దేశము యొక్క అవధులను దాటి,

అనేక దేశముల నాపహించి, ప్రపంచవ్యాప్తిని పొంది యున్నది.

మరియు, ప్రపంచ వ్యాప్తిని గాంచియుండిన క్రైస్త వము కూడ భారతీయ సంప్రదాయమే అగుచున్నది, పూర్వ కాలమున మన భారతీయ మహర్షులును, సన్యాసులును పాశ్చాత్యమున నేగాక ప్రపంచమునంతటను తిరుగుచుండెడి వారు. శ్రీ రామచంద్రుని ద్వితీయ పుత్రుడగు లవుడు దక్షిణ అమెరికాను జయించి, రాజ్యస్థాపన గావించినట్లుగా చరిత్ర తెలుపుచున్నది. ఆ విధముగా నాటి చక్రవర్తులే ప్రపంచము నంతటిని పర్యటించుచు, రాజ్యముల స్థాపించుచుండగా, ఇక సర్వప్రాపంచిక సుఖముల విడనాడి, వీతరాగులైన సన్న్యాసులు దేశదేశముల వ్యాపించి, traveling libraries సంచార గ్రంథాలయములవలె సంచరించుచు, ఆధ్యాత్మిక విషయముల ప్రచారము చేయుచు విశాలమును, విశ్వతో

ముఖమును ఆయిన దర్మసంస్థాపన చేయుటయందు ఆశ్చర్య మేమున్నది?

అదే విధముగ సన్న్యాసులు కొందరు, బౌద్ధమతము నకు చెందిన వారుకూడ ప్రపంచమున గుగ్రిమ్మరుచుండిరి. శీతోష్ణముల ననుసరించి వేషములు మారినట్లుగా, దేశముల పర్యటించుచుండిన యీ సన్న్యాసులకు వేషభాషలు మాత్ర మేకాక ఆచార వ్యవహారములును మార్పుచెందెను. అచట గల ప్రజానీకము యొక్క ఆచార వ్యవహారముల నవలం బించుచు, ఆయా దేశముల మత ప్రచారము గావించిరి. అందుచేత భారతదేశము నుండి వెడలిన బౌద్ధము, జపాన్ చైనాలలో మార్పు చెంది, ఆయా దేశముల నాక్రమించి నట్లుగా, క్రీస్తుకు పూర్వకాలముల బౌద్ధ భిక్షువులు అరే బియా దేశమునకుగూడ వెడలి, బౌద్ధమతమును ప్రచా రము గావించిరి. వారి బోధల నాకర్ణించి, అనందించి,

అనేకులు మతస్వీకరణము గావించిరి. అట్టివారే భిక్షులు, భిక్కులు, బిషప్పుల నామముల గ్రహించి యుండిరేమో! అనగా "భిక్షు" శబ్దము నుండియే బిషప్ శబ్దము జనించె నేమో!

అట్లు వ్యాపింప జొచ్చిన బౌద్ధమునందు జాన్ చేరి యుండుటచే నతడు జాన్ బాప్టిస్టుగా మారెను. ఆర్ష సన్యాసులవలె అతడును శాఖాహారి, తపోసంపన్నుడు. అతనిచే సాక్షితుడైన ఏసుక్రీస్తు పూర్వమతమును వదలి, నూతన మతమును స్వీకరించెను. అందువలన క్రీస్తు బౌద్ధమతావలంబికుడు అయ్యెను. ఆతని వెంట భిక్షువులతో పాటు భిక్షుణీలు కూడ నుండుట సుస్పష్టము. క్రీస్తు ప్రచారమును సహించని యూదులు అతనిని సిలువ వేయింపగా, బౌద్ధభిక్షులే అతనిని సిలువనుండి స్వాధీనము చేసికొని, గాయములకు ఔషధముల వేసి, మరల అతడు యూదులపాల బడనట్లుగా జాన్ బాప్టిస్టుకు ముఖ్యమైన భారతదేశమునకు

ఏసుక్రీస్తును పంపిరి. కాలక్రమమున నా క్రీస్తు చాల కాలము హిమాలయములలో నుండి, అచ్చటనే శరీరమును చాలించినట్లును, యీ నాటికికూడ అతని సమాధి అచ్చట నుండినట్లును కొందఱు చరిత్ర కారుల కథనము.

అదేవిధముగ తర్వాత జనించిన మహమ్మదీయ మత సన్న్యాసులుగూడ అరేబియా దేశమున, అర్ష సంప్రదాయము చేతనే ప్రోత్సహింపబడి, సన్న్యసించి, దేశ మతాచారములను పాటించుచు ఫకీరులుగ మాఱ్పుచెందిరి. వారుకూడ ముండనము గావించుకొనుచు, కమండలములు గూడ ఉపయోగించెదరు.

ఈ విధముగనే సన్న్యాసము అతి ప్రాచీనమై, సనాతమై, ప్రఖ్యాతమై, తనను తాను ఉద్ధరించు కొనుటయే

గాక, సామాన్య ప్రజల బాధలను ఏవిధమైనను రూపుమాపుచు ఆధ్యాత్మికముగ తపో విధానము నవలంబించి, ప్రశాంత తను ప్రసాదించుచు, ప్రపంచ వ్యాప్తమును పొందియు న్నది. ఈ సత్యమును మనసా గ్రహించిన సన్న్యాసులు, సర్వావస్థలై ప్రవర్తించుచు, పూర్వకాల సన్న్యాసుల శ్రేష్ఠమైన త్యాగవైరాగ్యముల సదా స్మరించుచు, అనుష్ఠించుచు, తాము శాంతిని అనుభవించుచు, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసులందరికి, ఇంద్రియాతీత మైన ఆనంద సంపదను విరివిగా పంచిపెట్టి యున్నారు.

పైన వచించినట్లుగా సన్న్యాసము యొక్క ఉత్కృష్టతను గ్రహించి, యోగ్యతల నార్జించి, బ్రహ్మచర్యము నుండి యత్యాశ్రమ స్వీకరణము జేసి, విద్యానుభవముల పొంది, 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' అనురీతి శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడై, మోక్ష సామ్రాజ్యాధిపత్యము వహించిన

యతి పుంగవుడు సంఘమున నేమి చేయును? సంఘమునకు ఏ విధముగా ఉపయోగించును? అను ప్రశ్నాపరంపరలు ఆదునిక యుగమున గల నేటి విద్యావేత్తలకు, విద్యార్థులకు జనించుచున్నవి. కాని సక్రమ సమాధానములు లభించుట లేదు. నేటి యీ భౌతిక విద్యావిధానమున సంశయములు కలుగుచునే యుండును. కాని ప్రాచీన విద్యా బోధనలో ఆసక్తితో, క్రమశిక్షణముతో కూడిన శిష్యుల పూర్వపక్షములు, ప్రేమ వాత్సల్యముల రంగరించి, అనుభవముతో కూడిన గురువర్యుల సమాధానములు కలవు. విద్యార్థి ఉపాధ్యాయుల సంబంధము సక్రమముగ నున్నచో ఆధ్యాత్మిక మార్గమున గురుశిష్యుల సంబంధము పవిత్రమై యుండగలదు. అందువలననే 'అధ్యాత్మవిద్యా విద్యానాం' విద్యలలో ఆధ్యాత్మిక విద్యను నేను అని భగవద్గీతలో శ్రీ కృష్ణ పరమాత్మ దివ్యవాణి. అందుచేత ప్రాచీన కాలము నుండియు విద్యాబోధన, క్రమశిక్షణ, రాజ్య పరిపాలనముల

సన్న్యాస సార్వభౌములే స్వీకరించిరిగదా! శిష్య శ్రేయస్సును అపేక్షించు వారి విద్యాప్రబోధములో నెందరు పండిత ప్రకాండులైరో! వారి వేదాంత ప్రచార ప్రభావముచే నెందరు ఆదర్శ సన్న్యాసులై యుండిరో! వారి ధర్మాచరణపారీణతచే నెందరు ధర్మబద్ధులై, ధర్మశీలురై ధర్మదండమును ధరించి, ధర్మరాజులై పరిపాలన చేసి యుండిరో! వారి కర్మ జ్ఞాన సమన్వయముచే నెందరు నిష్కామయోగులై లోకాదర్శముగ నుండిరో! పై విధముగ లోకమున బహువిధ ప్రజ్ఞామూర్తులను దయాసొనర్చి, ఆదర్శమైన గృహస్థులను మలచి, సంఘమును చక్కదిద్దిన వారు ఎవరు? సింహాసనముల నధిష్ఠింపక, అపేక్షింపక, అతీతులై, నేతలై, మహారాజులచే ధర్మపరిపాలనము చేయించినవారు ఎవరు? భారతీయాధ్యాత్మిక దివ్య సంస్కృతిని గురుశిష్యపరంపరగా లోకమునకు అందించినవారు ఎవరు? బ్రహ్మ విషయములనే గాక భూగోళ, ఖగోళ,

వైమానిక, నౌకా, వైద్యాదిక రహస్యముల గ్రహించి బోధించినవారు ఎవరు? లౌకికాలౌకిక విషయముల కూలంకషముగ దెలిసికొని, లౌకిక నశ్వరత్వమును మనసా గ్రహించి, అలౌకిక నిత్యానందమగ్నులై, లోకమునకు ప్రశాంతిని ప్రసాదించినవారు ఎవరు? మానవుల మనశ్శాంతికి, మనోజయమునకు వారి వారి ప్రవృత్తులకు అనుగుణముగ వివిధ సాధనలను తెలిపినవారు ఎవరు? అజ్ఞానియైన మానవుని తమోగుణమును దూరము గావించి, విజ్ఞానియై, విద్య నార్జించి, చంచలుడైన మానవుని రజోగుణమును పారద్రోలి, సుజ్ఞానియై, శాంతి కాముకుడు అయిన మానవుని సత్త్వగుణమును పెంపొందింపజేసి, త్రిగుణాతీతుడై, నిర్మలుడై, నిశ్చలుడై, నిర్వికారుడై, నిరంజనుడై, నిర్మోహుడై, నిర్వికల్పుడైన సిద్ధునికి ప్రజ్ఞా స్థితిలో ఆనందానుభూతిని అందించి, జననమరణ బంధములనుండి విడదీసినవారు ఎవరు? 'సర్వే జనా

స్సుఖినో భవంతు' సమస్త జనులు సుఖముగా నుండవలయు నని కాంక్షించియు, మరల ఆ భావనయు సంకుచితమని ఎంచి, 'లోకాస్సమస్తాస్సుఖినో భవంతు' సర్వలోకములు సౌఖ్యముతో నుండవలయునని, విశాల హృదయులై, విశాల భావమును ప్రకటించినవారు ఎవరు? ధర్మబద్ధులై, ధర్మాచరణముతో ధర్మస్వరూపులై, ధర్మశీలురై, ధర్మ రక్షకులై. ధర్మ ప్రబోధకులై, ధర్మ ప్రచారకులై, ధర్మ సూత్ర రచయితలై, ధర్మోద్ధరణము నుగావించినవారు ఎవరు? సంగములను వదలి, సంఘమునకు దూరమై, సాధనచే సిద్ధత్వమును పొంది, మరల సంఘమున ప్రవేశించి, ఆ సంఘ సంస్కారణమునకు కృషి చేసినవారు ఎవరు? సర్వసంగరహితులైన సన్న్యాసులే! మహర్షి పుంగవులే!

ఈ విధముగ ప్రాచీన ఆదర్శమును గ్రహించి, క్రమశిక్షణమును యిడినచో సంఘమున నీ యల్లకల్లోలములు నశించి, మానవ హృదయముల ఆధ్యాత్మికత ప్రవేశించి, ఆనందానుభవము లభించును. నాడే మన భారతీయ సంస్కృతీవైశిష్ట్యము ప్రకాశింపగలదు. నాడే మనది భారతదేశమై సమైక్యత సిద్ధింపగలదు. నాడే మనము భారతీయులమని ధైర్యముగ, సగర్వముగ వచింప గలము. నాడే శాంతిభద్రతలు సర్వత్ర నృత్యము చేయును. నాడే విజ్ఞాన కాంతిరేఖలు ప్రసరించి అజ్ఞానమును పటాపంచలు చేయగలవు. నాడే భారతదేశము ముముక్షువులకు మోక్షభిక్షను అందించగలదు.

పైన వచించినరీతిగా మన ఆర్ష సంస్కృతిని అలంకరించి, ఆనందమయము గావించి, సర్వశ్రేయోభిలాషి

యగు నీ సన్న్యాస విధానమును ప్రపంచమునకు ప్రసా దించిన భారత దేశము ఎంత ధన్యః సన్న్యాసమే లేకుండిన గృహస్థులకు శాంతి ఎచ్చట? సన్న్యాస, గృహస్థులకు యింత అవినాభావ సంబంధము కలదు. అటువంటి పవిత్ర సంబంధమును పెంపొందించుకొనుట యిరువురికి శాంతి ప్రదము. అటువంటి ప్రశాంతిని ప్రసాదించుటకే లోక మున యతివర్యుని సంచారము; సన్న్యాసి, అనువాడు స్వేచ్ఛాజీవి. అనగా ధర్మవిరుద్ధముగా సంచరించుటకు కాదు. ఆ స్వేచ్ఛకు ఎన్ని అడ్డంకులు వచ్చినా తెగగొట్టుకొనగల శక్తి గలిగినవాడే సన్న్యాసి. సన్న్యాసి అనగా కాషాయాంబ రధారి కాదు. కర్మశిక్షణముతో ఆత్మశిక్షణ చేసుకున్న ముముక్షువు అని అర్థం.

భారత సంస్కృతీవిభవ
పంక్తి గ్రహించి, స్మరించి, సం
సార విమోచకంబగు ప్ర
శాంతిని నీ యనుభూతి గాంచి, గం
భీరవిధాన నార్ష ఘన
విద్యుతి, సంక్షుభితాంధ లోక సం
తారణకై ప్రసారితము
ధన్యతజేసి తరింపు యతివరా!

యతివరా! భారతీయ సంస్కృతీ వైభవమును గ్రహించి, స్మరించి, సంసార రహితమైన ప్రశాంతి నీ యనుభవమున పొంది, ఆర్ష సంప్రదాయముయొక్క గొప్పదనమును గంభీరముగా, అంధకార బంధురములో బాధల నొందుచుండిన లోక సంతారణమునకు ప్రసరింప జేసి, ధన్యుడవై తరించుము.

అట్టి మహానుభావులు ఎంతరో!. ఆ విధమైన మన దివ్య సంస్కృతి వైభవము యీ క్రింద వ్రాయఁబడిన తత్త్వమున గాంచనగును.

సంసారమనగానె 'సాగరము దుఃఖ'మని
చాల ఏడ్చెదవేల మనసా
సాగరంబెటులయ్యె దుఃఖమ్మెనెటులయ్యె
సత్యమును నెరుగవే మనసా

శృతులు ప్రేమంబుతో పలుకు వాక్యాలను
శోధింపవే మది మనసా
జ్ఞానరహిత్యమే సంసారమని తెలిసి
జ్ఞానమార్జింపవే మనసా

వ్యాసుండు వత్సలత చెప్పు పురాణాల
భావించి కాంచవే మనసా

గీతాది గ్రంథాల కృష్ణుండు పలికిన
కీలకంబెరుగవే మనసా

నీకుగా జింతించి సతిసుతాదుల బాసి
పిలుచు బుద్ధుని వినవె మనసా
నిజముగా సంసారకారణము దుఃఖమను
నిగ్గు పల్కుల జూడు మనసా

తీవ్రవైరాగ్యమున గురుసన్నిధిని జేరి
శంకరుని మది నెంచు మనసా
తత్త్వమసి వాక్యాల బ్రహ్మతత్త్వము దెలిసి
శాంతినుండవె వెర్రి మనసా

రాగభక్తిచె దైవతత్త్వమ్ము గ్రాహ్యమను
రామానుజుని చూడు మనసా

భగవంతుడొక్కడే పరమ సత్యంబని
భక్తితో భజియించు మనసా

రామకృష్ణుడు శారదామాయి తెల్పిన
కామకాంచన బుద్ధి మనసా
కాలదన్నగలేక కన్నీరు కార్చిన
కార్యమేమున్నదే మనసా

స్వార్థంబు బోద్రోలి నిష్కామవర్తివై
నిల్వ, గల్గును శాంతి మనసా
అనుచు బోధించేటి కృష్ణాజీ వాక్యాలు
అంటవా నీ చెవికి మనసా

నీ చింత దొలగింప సర్వసన్న్యాసులై
నెగడు పెద్దల వినవు మనసా

నీ క్షేమకారణము బోధించువారల
లక్ష్యముంచవె పెర్రి మనసా

నిజముగా నీ శాంతి నీవు కాంక్షించితే
అసలు దుఃఖంబేది మనసా
తొలిలేని కాలమ్మునుండి యిందరు బుధుల
కలత చెందగనేల మనసా

కళ్ళు తెరచుటనుండి నేను నాదనుచును
కల్మషదృష్టితో మనసా
ఉండి సంసారమన దుఃఖసందర్భింబని
అనుచు నేడ్చెదవేల మనసా

స్వార్థబుద్ధియె సర్వ దుఃఖజాలంబులకు
మూలకారణమగును మనసా

స్వార్థమే లేకున్న సంసారమే లేదు
శాంతి యంతట గల్గు మనసా

లోనున్న యానంద పెన్నిధిని కనుగొనక
లోకాన వెతకుటేః మనసా
స్వార్థమూలమ్మును అశాంతి కారణము
సరిగ నేర్వవె పిచ్చి మనసా

స్వార్థనాశంబుననె సంసారమన దుఃఖ
సాగరంబును లేది మనసా
శాంతినిధానమై అనుభవానందమై
అమరిపోవే వినుము మనసా ★

★ ఈ అనుభవ తాత్త్విక గీతాన్ని, శ్రీ అనుభవానంద స్వాములవారు తమ పారివ్రాజక జీవితంలో గుంటూరుజిల్లా, తెనాలి బస్సుస్టేండులో, వచ్చేపోయే జనమధ్యంలో, బస్సు

పై విధమున లోకోద్ధరణమునకు కృషి సల్పినవారు సన్న్యాస సార్వభౌములు. వారు 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ' అను సూక్తిచందము స్వీయ ముక్తికి, లోక హితముకొరకే యీ లోకమున జన్మించుట। వారు సాధన చేసి సిద్ధులై, సాధకులకు సాధనా విధానముల తెలియజేయు

---

లలోకి ఎక్కుతూ, దిగుతూ, తోసుకుంటూ వున్న ఆ జీవ సందోహాన్ని చూస్తూ, ఆ అల్లకల్లోలం మధ్య ప్రశాంతంగా ఒకప్రక్క కూర్చుని "యీ సంసార సాగరంలో ఉన్నవారు కూడా యింతే' అనియు, దానికి నివారణోపాయం మహాత్ముల ప్రబోధాలే అనుసరణీయాలు" అన్నట్లుగా వ్రాసుకున్నారు 1940 వ సంవత్సరంలో. ఈ గీతం ప్రముఖ గాయని గాయకుల సహకారముతో త్వరలో విడుదల చేయనున్న (1) సాధన రహస్యము (2) అనుభవ రహస్యము అను స్టీరియో కేసెట్లలో రానున్నది.

మురు. వారు జ్ఞానమూర్తులై, అజ్ఞాన సాగరమగ్నులకు జ్ఞానోపదేశము గావించుదురు. వారు శాంతి స్వరూపులై, అశాంత మనస్కులకు ప్రశాంతతను ప్రబోధించుదురు. వారు భవసాగరమును తరించి, సాధకులకు తారణోపాయ మును నేర్పుదురు. వారు నిస్స్వార్థులై, నిర్మోహులై, స్వార్థపరులకు స్వార్థరహితత్త్వమును బోధించుదురు. వారు, ఉపాసకులై, ఉపాస్యమును సాక్షాత్కరింపజేసికొని, ఆ యా ఉపాసనా రహస్యములు ఉపాసకులకు వివరించుదురు. వారు ఇంద్రియ నిగ్రహులై, యింద్రియ నిగ్రహ ఫలిత ములను ఉపదేశించుదురు. వారు సంసారదూరులై, ఆనంద రూపులై, అనుభవమూర్తులై, సంసార పరితప్తులకు ఆనందామృతమును ప్రసాదించుదురు. వారు 'త్యాగే నైకే అమృతత్త్వమానశుః' అను ఉపనిషద్వచనరీతి త్యాగ చక్రవర్తులై, అమృతత్త్వమును పొంది, త్యాగ

ప్రాశస్త్యము నుపదేశించుదురు. వారు కరుణానిలయులై దుఃఖోదధిమగ్నులగు మానవాళి గాంచి, వారి విముక్తికై తపించి, మోక్షోపాయముల క్రోడీకరించి అనేక గ్రంథ రాజముల రచించుదురు. వారి వైరాగ్యము మేరు శిఖర మధిష్ఠింప, వారి అగాధ ఆధ్యాత్మిక జ్ఞానసంపద సాగర తుల్యమై, వారి పవిత్ర నిర్మల ప్రేమ కిరణములు శీతల చంద్రసమానమై యుండ, వారు ఆధ్యాత్మిక కల్పతరువులై ప్రకాశించుచుందురు. అట్టివారే భారతీయ దివ్యాధ్యాత్మిక సంస్కృతికి వారసులై, ఆధారులై, పోషకులై, రక్షకులై సదా వందనీయులగుచున్నారు గదా!

ఓ మనసా! సంసారమను సాగరమని దుఃఖమని దూషించుట ఎందుకు? అసలు సంసారము సముద్రముగ, దుఃఖ రూపముగ ఎట్లు పరిణమించినది? సంసారమున సార మున్నదా? "సంసారే కిం సారం? కంసారేశ్చరణకమలయో

ర్భజనం' కంసారి యగు శ్రీకృష్ణపాదకమల భజనమే సంసారసారముగ వర్ణితమైనది. యథార్థముగ ప్రపంచమున ప్రత్యేకముగ సంసారముగాని, లేక దుఃఖముగాని కలదా? లేదు. మరి ఎక్కడనుండి వచ్చినది యీ సంసారము? ఈ సంసారజనిత దుఃఖము అందరికి కలదా? లేదు. ముక్తులకు లేదుకదా! కాన యీ సంసార, దుఃఖములు రెండును అపవిత్రమగు సంబంధములచే పుట్టొందినవని గుర్తింపుము. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' బంధమోక్షములకు నీ మనస్సే కారణమను ఉపనిషద్వాక్యమును వినుము. ఆ మనస్సును శుద్ధి చేయుటకు యత్నింపుము, ఈ సంసారమునందలి సారమును అన్వేషింపుము. దానికై కృషి సల్పుము. ఈ సత్యమును గ్రహింపక దుఃఖించుట వ్యర్థముసుమా!

ఓ మనసా! మనకు వేదములు, ఉపనిషత్తులు, దర్శనములు, భగవద్గీతాదికములు అనేక శాస్త్రములు కలవు. అవి నీ శ్రేయస్సుకై పలుకబడిన ఆప్తవాక్యములు సుమా! జీవబ్రహ్మైక్యతత్త్వమును ప్రబోధించునవి, ఆ వాక్యములను శ్రవణము గావించినంత మాత్రమున ప్రయోజనము లేదు. 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' అను బృహదారణ్యకోపనిషద్వాక్యసరణి శ్రవణ మనన నిదిధ్యాసనముల చేయవలయును. 'యన్మనసా న మనుతే' ఏది మనస్సుచేత మననము చేయబడదో అదియే ఆత్మ అనియు, 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ' వాగాదింద్రియములు మనస్సుతోకూడ ఆ యాత్మను సమీపించలేకపోయినవనియు, 'తదేజతి తన్నైజతి తద్దూరే తద్వదంతికే' ఆ యాత్మ కదలును, కదలదు, ఆ యాత్మ దూరము మరియు సన్నిహితము అని కొన్ని వాక్యములును,

'మనసైవేదమాప్తవ్యం' ఆ యాత్మ మనస్సుచేతనే పొందబడునని కొన్ని యుపనిషద్వాక్యములు కలవు. వీనిచే మానవులకు సందేహములు కలుగుట సహజమేగదా! వాని అంతరార్థముల శోధించవలెనని అర్థము. దధిని చక్కగా మథించినగాని నవనీతము లభ్యముకానట్లు ఉపనిషత్సాగరమునుగూడ ఆర్తియను కవ్వముతో చిలికినగాని నవనీతసమానమగు అమృతత్త్వము ప్రాప్తించదు. సరియగు సమాధానములగూడ ఆ యుపనిషత్తులే వచించియున్నవి. 'మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ! అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం॥' మనస్సు శుద్ధాశుద్ధముగ ద్వివిధము. కామ సంకల్పములతో కూడినది అశుద్ధ మనస్సు. కామరహితమైనది శుద్ధ మనస్సు. అశుద్ధ మనస్సుచే నా యాత్మ తెలియబడదనియు, శుద్ధ మనస్సుచే నా యాత్మ గ్రాహ్యమనియు, మరియు నా యాత్మ అశుద్ధ మనస్సుకు దూరాతిదూరమై, చంచలముగ

గోచరింప, శుద్ధ మనస్సునకు అతి సన్నిహితమై, నిశ్చలముగ వ్యక్తమగును. ఇవియే శ్రుతి రహస్యములు. ఈ ఆత్మను తానుగా గ్రహించుటయే జ్ఞానము. ఈ జ్ఞానము లేకుండుటయే అజ్ఞానము. ఈ అజ్ఞానమే సంసారకారణము. కాన నీ సంసార వినాశనము జ్ఞాన సముపార్జనముచేతనే కలుగునుగాని అన్యముచే కలుగదు. అంధకారము ప్రకాశముచేతనేగదా నివర్తించుట! అందుచేత జ్ఞానమును సంపాదించుము.

ఓ మనసా! మన మహర్షిచంద్రులు ఎంత కరుణామయులో చూడుము. మానవాళి మనోశాంతికై అనేక ఉపాయములను, సాధనా విధానములను సమకూర్చి ప్రబోధించియుండిరి గదా! అట్టివారిలో శ్రీ వ్యాసమునిచంద్రుడు దయాసాగరుడై, వాత్సల్యమూర్తియై, ధీ శక్తి సమన్వి

తుడై, 'అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః।
అఫాలలోచనశ్శంభుః భగవాన్ బాదరాయణః॥' చతుర్వ
దనములు లేని బ్రహ్మయై, భుజద్వయముగల విష్ణువై,
ఫాలభాగమున నేత్రములేని శంకరుడై, భగవానుడని
కీర్తింపబడి అష్టాదశ పురాణముల ప్రసాదించెను. అంత
టితో తృప్తిగాంచక మరల అష్టాదశ ఉపపురాణముల
గూడ రచించి, అందు సృష్టికర్తనుండి సృష్టి రహస్యముల
వరకు గల విషయముల వివరించి, భగవంతుడే సృష్టికర్త
యని స్పష్టముగా వచించి, 'భగవంతుని సదా భావించి,
పూజించి, జపించి, ధ్యానించి, జీవితముల సార్థకపరచు
కొను'డని సర్వ జనులకు దివ్యోపదేశమును గావించెను.
ఆ పురాణముల చక్కగా శ్రవణము చేయుము.

ఓ మనసా! ఆ రహస్యములే భగవద్గీతలో జగద్గురు
వైన శ్రీ కృష్ణునిచేత అర్జునునికి వివరింపబడి, శ్రీ వ్యాస

మునివర్యునిచే గూర్చబడినవి. అజ్ఞానియైన అర్జునునకు, ప్రజ్ఞానస్వరూపుడైన కృష్ణపరమాత్మ అందించిన విజ్ఞాన సందేశమే భగవద్గీత. కర్మ ప్రాబల్యమున జన్మించి, కర్మలచే జుట్టబడి, కర్మపాశముల దగుల్కొని, కర్మాధీనులై దుఃఖించుచుండిన అజ్ఞానాహంకార జీవులకు కర్మయోగ రహస్యముల స్పష్టపరచి, కర్మలను యోగబుద్ధితో నే విధముగ జేయవలయునో వివరించి, బంధింపబడని కర్మయోగ మర్మముల దెలియజేసి, 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన' ఫలితముల నాశింపక కర్మల నాచరించుటయే మానవుల కర్తవ్యముగ ప్రబోధించి, 'యోగః కర్మసు కౌశలం' కర్మలయందలి కుశలత్వమే యోగమనియు, అదియే నిష్కామకర్మవిధానమనియు, ఆ నిష్కామ కర్మచే భక్తి లభ్యమనియు, ఆ భక్తిచే జ్ఞానమనియు, ఆ జ్ఞానము చేతనే కర్మలు దగ్ధములనియు, 'జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం

తమాహుః పండితం బుధాః 'అ జ్ఞానాగ్నిచే దహింప బడిన కర్మలుగలవానినే పండితునిగా నిర్వచించి, అట్టి పండితుడే అనగా ఆత్మవిషయైకబుద్ధి గలవాడే స్థితప్రజ్ఞుడనియు, ఆ స్థితప్రజ్ఞునియొక్క స్థితినే 'ఏషా బ్రాహ్మీస్థితిః' ఇదియే బ్రహ్మసంస్థితి యనియు, అజ్ఞాన నివారణోపాయములను, మోక్షమును కలిగించు అనేక ముఖ్యమగు తత్త్వ రహస్యములను పుష్కలముగా గీతాశాస్త్రమున శ్రీ కృష్ణ పరమాత్మ ప్రబోధించెనుగదా! వానిని గ్రహింపుము.

ఓ మనసా! నీకొరకు ఎంతమంది మహాత్ములు ఆవేదన చెందియుండిరో గ్రహించుము. తల్లి, బిడ్డల క్షేమము నరయునట్లుగా మహానుభావులు నీ శాంతికై ఎన్ని బాధలను పొందియుండిరోగదా! నీ దుష్ప్రవర్తనముచే గదా యీ బంధములేర్పడుట! వాని ద్రెంచుటకై నిన్నే

మనల ఆశ్రయించి, ప్రాపంచిక నశ్వరత్వముల నీకు పలువిధముల తెలియపరచి, శాశ్వతమగు అమృతత్త్వము నందలి ఆనందమును వ్యక్తము గావించి, నీ చపలత్వమును చూపించి, నీ తమోగుణమును రూపుమాపుటకు, నీ రజోగుణమును సడలింపజేయుటకు, నీ సత్త్వగుణమును పెంపొందింపజేయుటకు కృషి చేసినవారెందరో! నీ దుర్గుణములకు ఆవేదన చెంది 'మనసా ఎటులోర్తునే' అనియు, భగవద్భక్తియొక్క ఆధిక్యతను తెలుపుచు 'భజనపరులకేల దండపాణి భయము మనసా' అనియు త్యాగరాజు రామభక్తితత్పరుడై నీ కొరకు బాధను పొందియుండెనుగదా!

క్షత్రియవంశసంజాతుడై, చక్రవర్తిసుతుడై, భోగభాగ్యముల దులదూగుచు, దుఃఖ స్పర్శమైనను నెరుగక, లోకమును సుఖముగా భావించి, రథముపై నూరేగుచు, బాటలో సంచరించుచుండిన రోగి, వృద్ధుడు, మృతుడు,

సన్న్యాసి యను నలువురిని వీక్షించి, సూక్ష్మ బుద్ధిచే మానవుల జీవిత రహస్యముల గ్రహించి, తన్నివారణోపాయముల నిర్ణయించుకుని, త్యాగమే శరణ్యమని భావించి, సన్న్యాస జీవితమునకు సంసిద్ధుడై, అనురాగవతి యగు భార్యను, ఏడు దినములకు ముందుగా పుట్టొందిన పసిబిడ్డ యగు రాహులుని, అహర్నిశలు తనపై పుత్రమమకారముతో, వాత్సల్యముతో, ఆశలను నింపుకొనిన వృద్ధుడైన తండ్రిని వదలి, శాశ్వతానంద సామ్రాజ్యమును వరించుటచే, నీ అనిత్య సామ్రాజ్యమును త్యజించి, ఆనంద సముపార్జనార్థము అరణ్యములకు జని, తీవ్ర తపస్సు గావించి, జ్ఞానోదయమై అజ్ఞాన ధ్వాంతము పరుగులు పెట్ట, అహింసా జ్యోతియై, ప్రేమమూర్తియై చెలువొందు శ్రీ బుద్ధ భగవానుని ప్రశాంత వదనమును ఒక్కసారి తిలకించుము. ఆ నిశ్చలమూర్తి నీకై ఎంత ఆవేదన

చెందెనో ఒక్కపరి ఆలోచించుము. నీ శ్రేయస్సుకొరకు ఎంత త్యాగము గావించెనో! అందుచేత సంసారకారణము దుఃఖమను సత్పురుషుల వాక్యములలోని సత్యమును గ్రహింపుము. ఆచరింపుము.

ఓ మనసా! నిన్ను ఉద్ధరించుటకొరకేగదా అనేకమంది వైరాగ్యసంపన్నులగుట! నీవు వారి ఋణమును ఎట్లు తీర్చుకొనెదవో మరి! ఆ బాల్యవైరాగ్యయుతుడై, ఏకైక పుత్రుడై, అసాధారణ ప్రజ్ఞాధురీణుడై, జననిని ఒప్పించి, గృహమును వీడి, గుర్వన్వేషణము చేయుచు, గోవింద భగవత్పాదాచార్యుల దర్శించి, అంతేవాసియై, సకల విద్యానుభవముల పొంది, యత్యాశ్రమ స్వీకరణమొనరించి, భాష్యత్రియమును రచించి, అద్వైతమత సంస్థాపకుడై, దేశమంతట పాదచారియై తిరుగుచు, ప్రబోధించుచు, భక్తి



ప్రబోధక స్తోత్రాదికమును, అద్వైత విశేషముల దెలుపు

అనేక ప్రకరణ గ్రంథములను వివరించి, భారతదేశముననాలుగు దిక్కుల నాలుగు పీఠముల స్థాపించి, నలువురు శిష్యుల వానికి అధిపతులనుగ జేసి, ధర్మ పరిపాలన జేయ వారికి ఆజ్ఞ నిడి, అజ్ఞజనోద్ధరణముకై కృషి సల్పిన ఆది శంకరాచార్యుల ఆధ్యాత్మికౌన్నత్యమును భావించుము. మానవులకు జ్ఞానభిక్ష నిడిన ప్రజ్ఞానసంపన్నుడు ఆయన. మనోచంచలత్వమెట్టిదో, ఆ మనోజయముచే నెట్టి దివ్యానుభూతులు లభ్యమో సోదాహరణముగ వివరించిన ఆ యతి వరేణ్యుని ఆదర్శముగా గైకొనుము. జీవబ్రహ్మైక్యతను గూర్చి ఉపనిషత్తులు ప్రబోధించిన చతుర్విధ మహావాక్యములను స్మరింపుము. 'తత్త్వమసి' అనునది శ్రవణ వాక్యమై, 'అయమాత్మా బ్రహ్మ' అనునది మనన వాక్యమై, 'అహం బ్రహ్మాస్మి' అనునది నిదిధ్యాసన వాక్యమై, 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనునది చరమవాక్యమై, సాధకుని అత్యున్నత ఆధ్యాత్మిక శిఖరముల నధిష్ఠింప

జేయును, ఆ చతుర్విధ వాక్యాంతర్గత రహస్యములు సాధనచేతనే దెలియనగును, అప్పుడే అనుభవము! అప్పుడే పరిశాంతి! చిలుకవలె నా మహావాక్యముల పలుకుచు, తర్జన భర్జనల గావించుచు, వాగ్వాదముల సలిపిన, అనుభవములు సిద్ధింపవు. త్యాగము వినా సాధన వ్యర్థము. సాధన వినా అనుభవము మృగ్యము. అందువలన అనుష్ఠానము నకు యత్నించుము.

ఓ మనసా! నీ యీ దృష్టికి గోచరించు ప్రపంచమును నిత్యముగా భావింపకుము. జగత్కర్త ఒకడు కలడు సుమా! అతడే భగవంతుడు. 'ఏష సర్వేశ్వరః ఏష సర్వజ్ఞః ఏషోంతర్యామి ఏష యోనిః సర్వస్య ప్రభవా ప్యయౌ హి భూతానాం' అతడు యీ సర్వ భూతజాలములకు కారణమైనవాడు, లోనుండి నడుపుతున్నవాడు, సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు అని అతడిని ఉపనిషత్తులు కీర్తించినవిగదా!

ఇంకను అతడు సర్వరూపి, సర్వసాక్షి, సర్వవ్యాపి, సర్వగతుడు, అతడి శాసనమువలననే యీ ప్రపంచము, సూర్య, చంద్ర, నక్షత్రాదికములన్నియు నిలిచియున్న వనియు, 'భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః। భయాదింద్రశ్చ వాయుర్చ మృత్యుర్ధావతి పంచమః॥' అతడి యొక్క భయమువలననే అగ్ని మండుచున్నది. అతడి భయము వలననే సూర్యుడు ప్రకాశించుట। అతడి భయము చేతనే ఇంద్ర, వాయు, మృత్యువులు తమ తమ పనులను సక్రమముగ నిర్వహించుట జరుగుచున్నదని ఉపనిషత్తులు సర్వ శక్తివంతునిగ భగవానుని నిర్ణయించినవి. కాన భగవంతుడు మాత్రమే సత్యమని గ్రాహ్యము. అతడు 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అనుచందము ఒక్కడే సత్స్వరూపము. కాని పండితులు అనేకముగా అభివర్ణించి యుండిరి. అతడే సర్వ అవతారముల ధరించును. 'యే

యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం' అని గదా గీతోక్తి! అట్టి భగవానుని విష్ణువుగ విశ్వసించి, 'నారాయణాద్బ్రహ్మ జాయతే। నారాయణాద్రుద్రో జాయితే' నారాయణుని నుండి బ్రహ్మ, రుద్రులు జనించినట్లు నారాయణోపనిషత్తు నిర్వచించియుండగా, ఆ విష్ణువునే సర్వస్వముగ నెంచి, విష్ణువు నారాధించి, విష్ణుభక్తుడై, వైష్ణవుడై, వైష్ణవమును స్థాపించిన శ్రీ రామానుజాచార్యులు 'భక్తిచే భగవంతుడు సులభసాధ్యమని స్పష్టీకరించెను. కన రాగభక్తిచే భగవంతుని భజించి, భవరోగమును నశింపజేసికొన యత్నింపుము, భగవానుడు వినా మానవునికి స్థిరత్వము కలుగదు. నీ దృష్టిని లోకముపైగాక లోకకర్తపై ప్రసరింపజేయుము. సృష్టిని జూచిన, జననమరణములను పొందెదవు. సృష్టికర్తను గాంచిన జననమరణముల నతీతించెదవు. ఎంత వ్యత్యాసము!

ఓ మనసా! ఈ సకల దుఃఖములకు కారణమును తెలిసి కొనుము. ధర్మార్థకామమోక్షములు చతుర్విధ పురుషార్థ ములుగదా! మానవుడు ధర్మాత్ముడైనచో మోక్షమును పొంది, శాశ్వతానందమును బడయును. అర్థకామముల నపేక్షించిన, అనేక బాధల ద్రమ్మగుచు మోక్షదూరుడగును. ధర్మముతో కూడిన అర్థము అనగా ధనము దేవాలయ, ఆశ్రమాదిక సత్క్రమ నిర్వహణాదులకుపయుక్తమై పుణ్య మును పెంపొందింపజేయు, ధర్మముతో కూడిన కామము అనగా కోరిక ఆపేదనను కలిగించి, ఆర్తిని అధికము గావించి మోక్షమును ప్రసాదించును. కన మానవుని నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక జీవనమునకు పతన కారణ ములు అర్థకామములు అని సుస్పష్టము. అందువలననే 'అర్థమనర్థం భావయ నిత్యం' ధనము నవర్థముగా భావిం పుము అని శాస్త్రాదేశము. 'నాస్తి కామసమో వ్యాధిః'

కామముతో సమానమైన వ్యాధిలేదని మహాత్ముల వచనము. అర్థము ధర్మమునకు, కామము మోక్షమునకు ఉపయోగించిన మానవునికి శాంతి లభించును.

బాల్యాత్ప్రభృతి హృదయమున భక్తి బీజములు మొలకలెత్త, సగుణ భావసమాధుల నొంచుచు, చిన్ననాడే ప్రపంచ అనిత్యత్వమును గ్రహించి, ఆవేదనా పరితప్తమానసముతో దక్షిణేశ్వరమున ప్రవేశించి, లోకేశ్వరి శ్రీ కాళికామాతృ చరణారాధనాశీలుడై, ఆ జగన్మాత నర్చించి, ఆ మాతృమూర్తి దర్శన భాగ్యమునకై దపించి, ఆ జగజ్జననీ దివ్య సాక్షాత్కారమును బొంది, ఆమె అనుగ్రహమున సకల సాధనల గావించి, సర్వదేవతల సందర్శించి, సర్వమత సామరస్యమును దెలిపి, సర్వ సమన్వయమును జాటి, సంపూర్ణ సగుణనిర్గుణానుభవముల నా దేవ్యనుగ్రహమున సాధించి, సాధనావతారమని ప్రఖ్యాతిగాంచి, త్యాగధనుడై

విరాజిల్లిన శ్రీ రామకృష్ణ పరమహంస దేవుడు కామ కాంచనాతీత సంస్థితుల మగ్నత నొందిన అవతారవరేణ్యు డుగదా! ఆ సిద్ధమూర్తి యథార్థ సాధకలోకమునకు 'కామ కాంచనముల దూరముచేయుడు. వానిపైగల వ్యామోహ మును త్యజింపుడు. ఈ ద్వయమే సాధకుల ఉన్నత స్థితులకు అవరోధము కలిగించును' కామకాంచనాసక్తియే దుఃఖ ముల కలిగించును, అను దివ్య సందేశమును ప్రబోధించెను.

ఆ యాదర్శమును త్రికరణశుద్ధిగా అనుసరించి, కామ కాంచన విదూరలై, త్యాగమూర్తులై, త్యాగశీలలై, త్యాగ సంశోభితయై, త్యాగులకాదర్శమై, త్యాగాభరణ విభూషిత యై, త్యాగులచే నర్చింపబడుచు, వ్యావహారిక భర్తయు, పరమహంస చక్రవర్తియు నగు శ్రీరామకృష్ణ పరమహంస

దేవునిచేతనే దేవీ పీఠముపై పూజింపబడి, సకలానుభవ సం పన్నయగు శ్రీ శారదా దేవి ప్రపంచమునకు సర్వాదర్శము. శ్రీ శారదా దేవి సువర్ణాభరణములతో గాక త్యాగాభరణము లతో ప్రకాశించినది. తనను గూర్చి ప్రచారము చేయనీయక తన వ్యక్తిత్వమును నిలుపుకొనిన దివ్యమయి ఆమె. అట్టి సర్వగుణ సంశోభితులు, సర్వానుభవ స్వరూపులు, సర్వ సాధకజన వంద్యులు అయిన శ్రీ శారదా రామకృష్ణుల ఉపదే శముల ననుసరించిన ఆనందము తప్పక లభించును. కామ కాంచనాసక్తి విడువక, ఎన్ని పూజల గావించినను, ఎన్ని భజనల చేసినను, ఎన్ని గ్రంథముల పఠించినను, ఎంత శ్రవణము చేసినను, ఎన్ని జపదీక్షల నాచరించినను, ఎంత ధ్యానము గావించినను, ఎంత సమాధి మగ్నత కలిగినట్లు న్నను అవి యన్నియు వ్యర్థములు సుమా! ఆ త్యాగము,

నిరాడంబరరూపమున బాహ్యమునకు ప్రవహించును. ఈ పరమ సత్యమును గ్రహింపక విలపించిన నేమి ప్రయోజనము సిద్ధించును? 'మహాత్ములము' అనినంత మాత్రమున సర్వము సిద్ధింపదు సుమా!

ఓ మనసా! ఈ లోకమునగల అశాంతికి మూలకారణము స్వార్థమే సుమా! మనోశాంతికి భంగమును కలిగించునది కూడ యీ స్వార్థపిశాచమే. 'ధనములమిదం జగత్' ధన మూలమైనది యీ జగత్తు అనునట్లు 'స్వార్థమూలమిదం జగత్' స్వార్థమూలము యీ లోకమని భావింపవచ్చును. నిస్వార్థతయందే యథార్థ ప్రశాంతి. అట్టి ప్రశాంతిని సాధించి, దివ్యజ్ఞాన సమాజ సభ్యురాలగు అని బిసెంట్ వద్ద బాల్యమునుండి నివసించుచు, అకుంఠిత కృషి సలిపి, దేశవిదేశముల నేటికిని బర్యటించుచు, ప్రబోధించుచుండిన

శ్రీ జిడ్డు కృష్ణమూర్తి ప్రసంగముల సారాంశము యిదియే సుమా! ఇట్టి ప్రబోధముల నాలకించుము. అజ్ఞాన నిర్మూలనకు అవకాశము యిదియే!

ఓ మనసా! అనవసరముల పెంచుకుని, కష్టపరంపరలలో మునిగి చింతించేదవు. ఆ నీ చింతలన్నియు నశించవలెననిన త్యాగమే అవలంబించుము. నీ దుఃఖముల దొలగించు వారి ఉపదేశముల నాచరింపుము.

ఓ మనసా! నీవు యథార్థముగ శాంతిని కాంక్షించుచుంటివా? దుఃఖ నివారణోపాయమునకు అన్వేషణ చేయుచుంటివా? దుఃఖ నివారణ ప్రయత్నమున నీవు కృషి చేసిననిక ఆదుఃఖపిశాచము నీ దరిదాపులకు కూడ రానేరదుసుమా!

ఓ మనసా! కల్మష దృష్టి సంసారము నభివృద్ధిపరచి, దుఃఖమును కలిగింప నిక దుఃఖసాగరమని దుఃఖించుట దేనికి? వివేకమును పొంది, విరాగము నవలంభించి, గురు సన్నిధిని జేరి, సాధనల జేసి, గుర్వనుగ్రహమున నిర్మల దృష్టిని ఆర్జించినచో దుఃఖసాగర మేది?

సర్వ దుఃఖములకు యీ స్వార్థమే పుట్టినిల్లు. స్వార్థము సంకుచితమైనది. శాంతి విశాలమైనది. ఈ స్వార్థమే లేనిచో అంతటను శాంతి, ప్రశాంతియే! ఆ శాంతి నీలోనే యున్నది.

ఓ పిచ్చి మనసా! నీవెంత వెర్రిదానవు! అట్టి శాంతికై ప్రపంచమున అన్వేషించుట వ్యర్థము. కాలమును వ్యర్థ పరుచవలదు. ప్రయత్నము చేయుము.

ఓ మనసా! నీ సహజ స్థితిని స్మరింపుము. స్వార్థ మును సమూలముగ నశింపజేసికొనుము. స్వార్థనాశన

మగుట తోడ దుఃఖము పటాపంచలగును. ఇక దుఃఖము నకు కారణము లేదుగా! అప్పుడే నీవు శాంతికి నిధానమై, అనుభవస్వరూపమై, ఆనందము ననుభవింపగలవు. ఇక నైనను మేలుకొని, కృషి సాగించుము.

బ్రహ్మానందానుభవస్వరూపులే సదా లోక కల్యాణమును వాంఛింతురు! అట్టివారలే జగద్గురువులై, జగదుద్ధారకులై, జగచ్ఛాంతిని యాపిసంతురు! అట్టి యతిపుంగవుల ఆదర్శం సర్వదా అనుసరణీయము. ఆ యతిసంప్రదాయ వార్త సత్వమును గ్రహించి, అనుష్ఠించి, ఆనందించెదరు గాక!

హరిః ఓం తత్సత్

# సన్న్యాస వైభవము

## (ఆధ్యాత్మిక వారసత్వము)

వారసత్వం లౌకికం అలౌకికం అని ద్వివిధంగా ఉన్నది. లౌకికం అనిత్యమై, అశాంతియుతమై యుండగా, అలౌకికం నిత్యమై, ఆనందదాయకమై, లోకశాంతి కాకరమై యున్నది. ఈ అలౌకిక వారసత్వమే ఆధ్యాత్మిక వారసత్వం. ఈ ఆధ్యాత్మిక వారసత్వమే మన భారతదేశానికి వెన్నెముక. అందుచేతనే The head of the world ప్రపంచమునకు శిరస్సు అను శ్రీరామ తీర్థుని వాక్యముల రీతి భారతదేశము విఖ్యాతినొందినది. దీనికి వారసులు సన్న్యాసులు. అనాది కాలం నుండి ఆ వారసత్వాన్ని కాపాడుచు, శిష్యపరంపర ద్వారా పోషిస్తూ, స్థిరత్వాన్ని కల్పించినవారు యతిసార్వభౌములు. ఆ గురు శిష్యపరంపరా వివరములు, సన్న్యాస వివరములు గల వివరణాత్మకమగు మహోజ్వల గ్రంధము యిది.